# గణపతి రహస్యం మరియు శివరాత్రి రహస్యం





మట్టి గణపతి



అగ్నిహోత్ర గణపతి



సరళార్థ వివరణ కర్త

**సుమ్నార్థి**

(డా॥ కోడూరి సుబ్బారావు)



# గణపతి రహస్యము

మరియు

# శివరాత్రి రహస్యము



మట్టి గణపతి



అగ్నిహోత్ర గణపతి


కర్త:

సుమ్నార్థి

(డా॥ కోడూరి సుబ్బారావు)

సంపాదకులు

వాచస్పతి డా॥ మట్టి కృష్ణారెడ్డి. M.A.M.Ed.Ph.D. D.lit.,



గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

# గణపతి రహస్యం మరియు శివరాత్రి రహస్యం

గాయత్రీ గ్రంథమాల: 67

ప్రతులు : 1000

సర్వస్వామ్యములు : గ్రంథకర్తవి

సృష్టి సంవత్సరం : 1,97,29,49,122

విక్రమాబ్దము : 2077

కలియుగ సంవత్సరం: 5122

శ్రీ వికారి నామ సం॥ర పుష్యమాసం, మకర సంక్రాంతి, 15-1-2021

**మూల్యము : 50/-** (తపాలా ఖర్చులు అదనము)

ప్రతులకు :

1. డా॥ కోడూరి సుబ్బారావు, వైదికవానప్రస్థాశ్రమం, హనుమాపురం(B.O.); (Via.)భువనగిరి-508116. సెల్: 99089 94084.
2. గాయత్రీ ఆశ్రమ ట్రస్టు, ఆర్యసమాజము, 12-10-586/6, మేడిబావి, సీతాఫలమండి, సికింద్రాబాద్-500 061. సెల్: 98480 11073.
3. డా॥ మట్టి కృష్ణారెడ్డి, వేదధర్మ ప్రచార ట్రస్టు(రి.)., 2-27,ఆర్య సమాజ మందిరం, బాదం కాంప్లెక్సు,చైత్యనపురి క్రాస్ రోడ్, దిల్‌సుఖ్‌నగర్. హైదరాబాద్-60. సెల్: 94412 00322.
4. శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, షాప్ నెం.5, మాశెట్టి బిల్డింగ్, 3-3-736-740, కంచరిబజార్, సికింద్రాబాద్, ఫోన్: 040-6632 0300.
5. శ్రీ బాశెట్టి సత్తయ్య, జె-38, రాంగోపాల్‌పేట, సికింద్రాబాద్-500003. సెల్ : 99485 39795.
6. ఆర్యసమాజము, కూచిపూడి, తెనాలి-522313. సెల్:08644-252789.
5. ఆర్యసమాజ మందిరం, మెయిన్‌రోడ్, రైల్వే ప్లైఓవర్ దగ్గర, సీతాఫలమండి-500061, 040-27071816; 9133134156; 9246174018

# ఓ గణపతీ !
# మాకు మేధాబుద్ధిని ప్రసాదింపుము

ఓం మేధామహం ప్రథమాం బ్రహ్మణ్వతీం
బ్రహ్మజూతాం ఋషిష్టుతామ్ ।
ప్రపీతాం బ్రహ్మచారిభిః దేవానాం అవసే హువే ॥

- అథర్వవేదం (6-108-2)

ఓ గణపతీ ! జీవగణములకు పతివైన పరమేశ్వరా ! ముఖ్యంగా మాకు గొప్పదైన మేధాబుద్ధిని ప్రసాదింపుము. వేదవిజ్ఞానయుక్తమైనట్టియు, బ్రహ్మజ్ఞానులచే సేవింపబడునట్టియు, ఋషులచే స్తుతింపబడునట్టియు, బ్రహ్మచారులు పొందగోరునట్టియు నైన ఉత్తమ మేధస్సును మేము మాలోనికి ఆహ్వానించుచున్నాము. అది మాలోని ఆసురీ శక్తులను- కామ క్రోధ లోభాదులను వెడలగొట్టి మా దైవశక్తులను, దివ్యగుణాలను రక్షించునుగాక!

అట్టి సుమేధతో మేము నీ సత్య స్వరూపాన్ని తెలుసుకొని, నిన్నుపాసించి త్రివిధ దుఃఖాలనుండి విడివడి నీ తృతీయధామమును చేరుదుముగాక ! నీలో స్వేచ్ఛగా విహరించుచు నీనుండి జ్ఞానమును, ఆనందమును పొందుచుందుము గాక!

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు**

# విషయసూచిక

## గణపతి రహస్యం-


| | | |
|---|---|---|
| 1. | గణపతి రహస్యం | 7 |
| 2. | వేదాలలో గణపతి స్వరూపం | 9 |
| 3. | దేవుడొక్కడే నామములనేకం | 13 |
| 4. | "గణపతి" అంటే | 13 |
| 5. | దేవతలు ఎన్ని? | 14 |
| 6. | పురాణాలలో గణపతి | 20 |
| 7. | ప్రతీకలు - ప్రత్యాయనీయాలు | 22 |
| 8. | గాణాపత్య సంప్రదాయం | 27 |
| 9. | గణపతి నిమజ్జనం ఒక ప్రహసనం | 28 |
| 10. | విద్యా గణపతి - ఆచార్య గణపతి | 31 |
| 11. | ప్రసిద్ధ వ్యక్తుల దృష్టిలో గణపతి | 35 |
| 12. | మహాభారతం వ్రాసిన గణపతి | 36 |
| 13. | ముగింపు మాటలు (Conclusion) | 37 |
| 14. | ప్రతీకలే విగ్రహాలయ్యాయి | 39 |


## శివరాత్రి రహస్యం-


| | | |
|---|---|---|
| 1. | శివరాత్రి రహస్యం | 43 |
| 2. | అథ శివ జిజ్ఞాసా | 44 |
| 3. | వేదాలలో శివ సంకల్ప మంత్రాలు | 58 |
| 4. | నమకమ్ | 60 |
| 5. | చమకమ్ | 68 |

# సార్వజనిక నియమాలు

-మహర్షి దయానందసరస్వతి

1. సమస్త సత్యవిద్యలకును, విద్యవలన నెరుంగదగు సర్వపదార్థముల కును ఆదిమూలము పరమేశ్వరుడు.
2. ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు, నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాళువు, అజన్ముడు, అనాది, అనంతుడు, నిర్వికారుడు, అనుపముడు, సర్వాధారుడు, సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్తయునై యున్నాడు. అతనినే ఉపాసించుట యోగ్యము.
3. వేదము సత్యవిద్యల గ్రంథము. దీనిని చదువుట - చదివించుట, వినుట - వినిపించుట, ఆర్యులకందరికి పరమ ధర్మము.
4. సత్యమును గ్రహించుటకును, అసత్యమును త్యజించుటకును ఎల్లప్పుడును సిద్ధముగా నుండవలెను.
5. సకల కార్యములను ధర్మానుసారముగా అనగా సత్యాసత్యములను విచారించి చేయవలెను.
6. ప్రపంచమునకు ఉపకారము చేయుట, ఈ సమాజము యొక్క ముఖ్యోద్దేశ్యము.
7. అందరితో ప్రేమ పూర్వకముగ ధర్మానుసారముగ యథాయోగ్యముగ వ్యవహరింపవలెను.
8. అవిద్యను నశింపచేసి విద్యను పెంపొందింప జేయవలెను.
9. ప్రతివ్యక్తియు తన ఉన్నతితోనే సంతృప్తినొందక, అందరి ఉన్నతిలోనే తన ఉన్నతి కలదని తలంపవలెను.
10. సర్వహితకరములగు సామాజిక నియమములను పాలించుటలో పరతంత్రులై వ్యక్తి హితకరములగు నియమములందు స్వతంత్రులగుట అందరికి తగును.



# గణపతి రహస్యం

భాద్రపద శు. చవితి 'వినాయక చవితి' పండుగగా లోకంలో బహుళ ప్రాచుర్యాన్ని పొందింది. ఆ రోజు హిందువులుగా వ్యవహరింపబడు ఆర్యులంతా భక్తి శ్రద్ధలతో వినాయకుని పూజించి, గణపతి నవరాత్రులనే పేరుతో 9 రోజులు ఉత్సవాలుగా జరుపుకుంటారు. 10వ రోజున గణపతులను జలనిమజ్జనం చేస్తారు. మా చిన్న (1950-1960) నాటి మాట

భాద్రపద శు.తదియనాడు మధ్యాహ్నం విద్యాలయాలకు సెలవిచ్చేవారు. మరునాడు వినాయక చవితి ఏర్పాట్లు చేసుకోవటానికి పిల్లలమంతా పొలాలలోను, తోటలలోను తిరిగి మామిడాకులు, కలువ తామర పూవులు, వెలగ, మారేడు, జామ మొదలగు కాయలు, మొక్కజొన్న కంకులు మొదలగునవి సేకరించి తెచ్చుకునే వారము. చవితినాడు వాటితో పాలవెల్లులు (పూజపీఠంపై వ్రేలాడగట్టే పందిరి లాంటివి) చక్కగా అలంకరించి, గుమ్మాలకు మామిడి తోరణాలు కట్టేవారము. స్వర్ణకారుల యింటికి ఒక పళ్ళెరంలో స్వయంపాకం (ఒకరిద్దరికి సరిపడే బియ్యము పప్పులు ఉప్పులు మొదలగునవి) తీసుకువెళ్ళి వారికిచ్చి, క్రొత్తగా అచ్చువేసిన మట్టి గణపతులను అదే పళ్ళెరంలో పెట్టుకుని యింటికి తెచ్చేవారము. అనంతరం స్నానాలుచేసి మడిబట్టలు (సామాన్య వస్త్రాలే ఉతికి ఆరవేసినవి) కట్టుకొని పూజచేయించే పురోహితుల రాకకొరకు ఎదురుతెన్నులు చూచేవారము. ఆ రోజు పూజచేసేవరకు ఏమీ తినకూడదనే కఠిన నియమముండేది. మాకు ఉదయమే స్నానంచేసి 7 గంటలకే చద్ది అన్నం తినే అలవాటు. అట్టిది ఆరోజు 11,12 గంటలవరకు ఏమీ తినకుండా ఉండాలంటే చాలా కష్టమనిపించేది. పూజ కాకముందే కడుపులో ఉన్న దేవుడు కనబడేవాడు. ఎట్లో ఓర్చుకుంటూ పూజచేసి భోజనం చేసేవారము. అయితే, ఒక విషయంలో మాకు ఉపశమనం ఏమిటంటే - పుస్తకాలన్నీ గణపతి దగ్గర పెట్టేముకదా! కనుక ఆ రోజు చదువుకునే పని, హోమ్ వర్కు చేసేపని లేకపోవటం.

మధ్యాహ్నం స్నేహితుల ఇండ్లకు వెళ్ళి వాళ్ళని చూసివచ్చేవారము. వారిని మా యింటికి ఆహ్వానించి మావి చూపించే వారము. సాయంత్రం పూజ అక్షంతలు నెత్తిమీద వేసుకొని చవితిచంద్రుని దర్శించి "నీలాపనిందలు రాకుండా కాపాడు" మని గణపతిని ప్రార్థించేవారము. భోజనం చేసి గుడిలో చెప్పే హరికథకు వెళ్ళేవారము. ఆ రోజులలో సంవత్సరంలో జరిగే రకరకాల పూజలలో మగవారు కూడా కూర్చొని చేసేది వినాయక చవితి పూజ ఒక్కటే ఉండేది. మిగతా పూజలన్నీ స్త్రీలే చేసేవారు.

నేడు ఆ భక్తిశ్రద్ధలు నామమాత్రమయ్యాయి. ఇంట్లోని పూజ బజారుకెక్కింది. వీధివీధినా చందాలు వసూలుచేసి (బలవంతంగా కూడా) కొంత గణపతి పూజకు, కొంత వారి పూజకు (స్వంత ఖర్చులకు) ఖర్చు చేస్తున్నారు. ఒకరినిమించి, ఒకరు (పెద్దవారు పెద్దగా, చిన్నవారు చిన్నగా) పోటీపడుతున్నారు. అంతకంతకు విగ్రహాలు పెద్దవవుతున్నాయి. గణపతుల సంఖ్య పెరుగుచున్నది. జలనిమజ్జనం కూడా పెద్దపెద్ద ఊరేగింపులుగా అట్టహాసంగా సాగిపోతున్నాయి. రకరకాల రూపాలతో గణపతి విగ్రహాలు దర్శనమిస్తున్నాయి. కొన్ని జంతువుల ఆకారంలో కూడా ఉన్నాయి. ఈ వింతవింత గణపతులకు ఏ శాస్త్రాలు ఆధారమో, ఏ పురాణాలు ఆధారమో తెలియదు. ఇంతకీ గణపతి అంటే అసలు అర్థమేమిటో తెలిసింది ఎందరికి? కనుక, ఇట్టి పరిస్థితులలో సరియైన గణపతి విజ్ఞానం తెలుపాలనే సదుద్దేశ్యంతో ఈ చిన్న పుస్తకం ప్రచురిస్తున్నాము.

మనం హిందువులమనీ, మనమతం హిందూమతమనీ పెక్కురను కుంటారు. కాని, మనం ఆర్యులం. మన మతం వేదమతం. ఆర్యులంటే ఏ దేశంనుండో ఇక్కడకు వలస వచ్చినవారు కాదు. అసలు ఆదిమానవ సృష్టి జరిగింది ఈ దేశంలోనే. అది త్రివిష్టప పీఠభూమి. నేడు దానిని టిబెట్ అంటున్నారు. పూర్వం టిబెట్, భూటాన్, బర్మా, బంగ్లాదేశ్, పాకిస్థాన్, శ్రీలంక అన్నీ మన దేశంలోని భాగాలే. అప్పుడు దానిని భరతవర్షం అనేవారు. సంస్కృతంలో వర్షం అంటే దేశమని అర్థం. ఇప్పటికీ మనం ధార్మిక క్రియాకలాపాలలో భరతఖండే, భరతవర్షే, ఆర్యావర్త పుణ్యభూమౌ అని

సంకల్పం చెప్పుకుంటాము. ఆసియా ఖండాన్నే పూర్వం భరత ఖండం అనేవారు. మరికొన్ని వివరాలకు నా రచన 'మన ఇతిహాసం'లో చూడండి.

మతపరంగా మనం వేదమతానికి చెందినవారము. సృష్టికర్త ఆది మానవులకిచ్చిన జ్ఞాననిధులే వేదాలు. అవి ఈ దేశంలోనే ఆవిర్భవించాయి. దయామయుడైన సృష్టికర్త అత్యుత్తమ ప్రాణిగా మానవుని సృజించి, జ్ఞానగ్రహణ సామర్థ్యంగల బుద్ధిని ప్రసాదించాడు. ఇది మానవునకు 6వ జ్ఞానేంద్రియంగా-అంతరింద్రియంగా ఉంది. కన్నులు రూపాలను, చెవులు శబ్దాలను, నాలుక రుచులను గ్రహించినట్లే మన బుద్ధి జ్ఞానాన్ని గ్రహిస్తుంది. మిగిలిన జ్ఞానేంద్రియాలకు రాజుగా ఉంటుంది. అవి తెచ్చిన శబ్ద స్పర్శ రూప రస గంధాలను వివేచించి తన కవసరమైన వాటిని బట్టి కర్మేంద్రియాలతో స్పందించి పొందుతుంది. ధర్మాధర్మాలను, సత్యాసత్యాలను, గ్రాహ్య+అగ్రాహ్యాలను, కర్తవ్య+అకర్తవ్యాలను తెలుసుకునేది కూడా బుద్ధియే. మా పూర్వ ప్రచురణ **"వేదాలలో మనోవిజ్ఞానం"** ద్వారా తెలుసుకున్న గొప్ప గొప్ప గుణాలన్నీ బుద్ధికుంటాయి. అది **"జ్యోతిషాం జ్యోతిః ఏకం"**- (యజు. 34-1) ఇంద్రియ జ్యోతుల కన్నిటికి వెలుగునిచ్చే అంతర్జ్యోతి. అది ఒక్కటే అయినా మనను ఇంద్రియాలన్నిటితో కలుపుతుంది.

సృష్టికర్త అట్టి బుద్ధికి విషయంగా ఈ అద్భుతాద్భుత సృష్టిలో మానవుల కవసరమైన సమస్త విద్యలను సూత్రరూపంలో (బీజరూపంలో) వేదాల ద్వారా తెలిపాడు. వాటిలో ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవిక జ్ఞానమంతా ఉంది. అయితే అవి మంత్రాలరూపంలో ఉన్నాయి. అంటే మనన చింతన నిధిధ్యాసనలు చేసి గ్రహించవలసినవి. **"మననాత్ మంత్ర ఇతి ఉచ్యతే"** అని ఋషులన్నారు. కనుక మనం ముందుగా జ్ఞానవిధులైన వేదాలలో గణపతిని గురించి ఏమి చెప్పబడి ఉందో తెలుసుకునే ప్రయత్నంచేద్దాము. అనంతరం మిగిలిన ఆధ్యాత్మిక శాస్త్రాలలో ఉన్న వాటిని గురించి ఆలోచిద్దాము.

## వేదాలలో గణపతి స్వరూపం

ముందుగా మనం ఋగ్వేదంలో చెప్పబడిన గణపతిని గురించి తెలుసుకుందాము.

ఓం గణానాం త్వా గణపతిం హవామహే
కవిం కవీనామ్ + ఉపమశ్రవస్తమమ్।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆ నః శృణ్వన్ +ఊతిభిః సీద సాదనమ్ ॥

-ఋగ్వేద (2.23.1)

19 మంత్రాలు గల ఈ ఋగ్వేద ద్వితీయమండల 23వ సుక్తానికి ఋషి **'గృత్సమదుడు'** అంటే- సృష్టికర్త సృష్ట్యాదిలో ఋగ్వేదాన్ని అగ్నినామక ('అగ్ని' అను పేరుగల) ఋషి హృదయంలో (బుద్ధిలో) ప్రకటింపగా, బ్రహ్మ అను పేరుగల మరొక ఆది ఋషి దానిని అభ్యసింపగా, ఆ బ్రహ్మఋషివద్ద గృత్సమదుడనే ఋషి అభ్యసించి ఈ సూక్తాన్ని మనన చింతన నిధిధ్యాసనలు చేసి, ఈ మంత్రాల అర్థాన్ని అంతర్యామి నుండి గ్రహించి తోటి మానవులకు వివరించి చెప్పాడన్న మాట. కనుక ఈ సూక్తానికి అసలు కర్త పరమేశ్వరుడు. ఈ గృత్సమదుడు ఆ మంత్రార్థాల ద్రష్ట. **"ఋషయో మంత్రద్రష్టారః"** అని ఋషి పదమునకు నిర్వచనం.

ఈ 19 మంత్రాలలో 6 మంత్రాలకు **'బ్రహ్మణస్పతిః'** దేవత. అంటే - ఈ మంత్రాలలో బ్రహ్మాండ పతిని గురించి చెప్పబడింది. మిగిలిన 13 మంత్రాలకు 'బృహస్పతి' దేవత. ఈ పదమునకు పెద్దపతి- అని అర్థం. ఈ రెండు పదములు ఆధ్యాత్మికార్థంలో సృష్టిస్థితిలయ కర్తయైన ఏకేశ్వరునికే వర్తిస్తాయి.

గణములు అంటే- (గణ సంఖ్యానే) సమూహములని అర్థం. జీవ గణములకు, ప్రకృతి గణములకు అన్నిటికి పతి (పాలకుడు, పోషకుడు, రక్షకుడు) గనుక గణపతి పదము దేవునకే వర్తిస్తుంది. అప్పుడు ఈ మంత్రార్థం ఈ విధంగా ఉంటుంది-

**మంత్రార్థం:** ఓ సృష్టికర్తా! సర్వాంతర్యామీ! లెక్కించతగిన సమూహము లన్నిటికి నీవే పతివి. అట్టి నిన్ను మా హృదయాలలోనికి ఆహ్వానిస్తున్నాము. కవులలో నీవు సర్వజ్ఞ కవివి. నీవు గొప్పగా కీర్తించతగిన జ్యేష్ఠరాజువు. అట్టి

నిన్ను మా రక్షణకొరకు మా హృదయములలోనికి (బుద్ధులలోనికి) విచ్చేసి స్థిరముగా మాయందే ఉండగోరుచున్నాము. నిన్ను తప్ప మరొకరిని ఉపాసించకుందుముగాక !

We invoke the Omniscient, Unmatched and the Great God who always is in the mind of noble persons. We pray to Him to seek His protection and to make Him attentive to our prayers permanently.

ఇప్పుడు యజుర్వేద మంత్రాన్ని గురించి తెలుసుకుందాము.

**ఓం గణానాం త్వా గణపతిం హవామహే,**
**ప్రియాణాం త్వా ప్రియపతిం హవామహే ।**
**నిధీనాం త్వా నిధిపతిం హవామహే,**
**వసో మమ ఆహమజాని**
**గర్భధమా త్వమ్ +అజాసి గర్భధమ్ ॥**

- యజుర్వేదం (23-19)

ఈ మంత్రానికి ప్రజాపతి ఋషి, గణపతి దేవత. మంత్రార్థం ఈ విధంగా ఉంటుంది-

ఓ జగదీశ్వరా ! గణములమధ్య గణములను పాలించునట్టి నిన్ను ఆహ్వానిం చుచున్నాము. ప్రియమైనవారలలో నీవు అత్యంత ప్రియుడవు. కనుక నిన్ను ప్రశంసించుచున్నాము. నిధిపతులమధ్య నిన్ను అత్యంత నిధిపతిగా స్వీకరించు చున్నాము. సకల ప్రాణులను వసింపజేయునట్టి ఓ వసో-పరమాత్మా! నీవు అజుడవని, ఏ తల్లి గర్భంలోనికి వచ్చి జన్మించవని చక్కగా తెలుసుకుందుముగాక ! సకల విశ్వమును నీ గర్భమునందే ధరించు హిరణ్యగర్భుడవని చక్కగా అర్థం చేసుకొందుముగాక!

O God ! We invoke Thee, the troop-Lord of Troops. We invoke thee, the lord of the beloved ones. We invoke Thee, the Lord of the treasure of Knowledge. O God! all beings reside in theee.Thou art my judge. I Know Thee fuil well free from birth, the Sustainer of matter that keeps the universe in womb. Thou Knowert matter!

**వివరణ:** పై యజుర్వేద మంత్రం గణపతి సమస్త బ్రహ్మాండాలను, అందలి జీవగణాలను తన గర్భంలో ధరించుచున్నాడని స్పష్టంగా చెబుతోంది. ఇంతేగాక,

**'అహమ్ +అజాని+గర్భధమ్ త్వమ్ అజాసి'** = నీవు అజుడవని - జన్మింపనివాడవని నేను చక్కగా తెలుసుకొందును గాక! అని చెప్పుచుండగా పురాణాలలో గణపతి జన్మవృత్తాంతం రకరకాలుగా వర్ణింపబడ్డాయి.

యజుర్వేదంలోని చివరి 40వ అధ్యాయం పొరపాట్లకు తావియ్యకుండా పరమేశ్వరుని స్వరూపాన్ని మరింత స్పష్టంగా చెబుతుంది. **"ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్"** ఈ సృష్టి అంతా - కించిత్ నుండి గతిశీలమైయున్న ఈ జగత్తంతా ఈశునిచే -(ఒక నియామకశక్తి చే) వ్యాపించబడి ఉందంటూ ప్రారంభించబడిన ఈ అధ్యాయం లోకంలో ఈశోపనిషత్‌గా, మొదటి ఉపనిషత్తుగా ప్రసిద్ధిని పొందింది.

**ఓం తదేజతి తన్నైజతి తద్దూరే తద్వంతికే ।**
**తదంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః ॥**

- యజు. (40.5)

అన్నిటిని నియమించి నడిపిస్తున్న ఆ ఈశుడు (దేవుడు) తాను కదలడు. కాని విశ్వంలోని గ్రహ గోళాల నన్నిటిని నియమబద్ధంగా త్రిప్పుతున్నాడు. అతడు అత్యంత సమీపంలోనూ ఉన్నాడు, అత్యంత దూరంలోనూ ఉన్నాడు. అన్నిటి లోపలా వెలుపలా కూడా ఉన్నాడంటుంది. అతని ముఖ్యగుణగణాలను మరింత స్పష్టం చేస్తూ 8వ మంత్రంలో

**సపర్యగాత్+శుక్రమ్+అకాయమ్+అవ్రణం అస్నావిరం శుద్ధమ్+ అపాపవిద్ధమ్** = ఆ ఈశతత్త్వం అంతటా అన్నిటా వ్యాపించి ఉంది. అది సర్వ శక్తివంతము. దానికి మనవలె శరీరం లేదు. ప్రణాది రహితం. నాడులతో బంధింపబడి సుఖదుఃఖాల ననుభవించటం లేదు. అవిద్యా, అజ్ఞానాలులేని శుద్ధమైనది. పాపపుణ్యాల బంధనంలేనిది.

**కవిః + మనీషీ** = అది సర్వజ్ఞకవి. ఆది ఋషుల హృదయాలలో సృష్టి విజ్ఞానాన్నంతా వేదాలద్వారా ప్రకాశపరచిన అంతర్యామి. సర్వజీవుల మనోవృత్తులను తెలుసుకొనుచున్న మనీషి.

పరిభూః స్వయంభూః = దుష్టులను, పాపులను వారెంతటి శక్తి శాలురైనను అణచిపెట్టగల తత్త్వం. స్వయంభువుడు = లోకంలోని ప్రాణులవలె మాతా పితరులు, గర్భవాసము, జన్మవృద్ధి క్షయాములు లేని అనాది స్వరూపం. దాని ఉనికికి మరొక కారణం లేని స్వయంభువము అంటుంది. ఆ సర్వవ్యాపక తత్వానికే దేవుడని పేరు పెట్టి అనేక నామములతో దానిని సంబోధిస్తుంది. వర్ణిస్తుంది. వివరిస్తుంది.

## దేవుడొక్కడే నామములనేకం

ఈశ్వరీయ జ్ఞానమైన నాలుగు వేదాలలోను ఏకేశ్వరుని నామములు 150 కి పైగా కనబడతాయి. ఈ నామములన్నీ వేరువేరు దేవుళ్లను కుంటారేమోనని ఆ విషయం స్పష్టం చేస్తూ సృష్టికర్త ఏమన్నాడంటే-

**ఇన్ద్రం మిత్రం వరుణమగ్ని మాహురథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్ ।**
**ఏకం సత్+విప్రా బహుధా వదన్తి+అగ్నిం యమం మాతరిశ్వాన మాహుః॥**

- ఋగ్వేదం (1-164-46)

ఓ మానవులారా! సృష్టి స్థితి లయములు చేయుచున్న సత్ పదార్థం - నేను ఒకే ఒక్కడిని. నన్నే విప్రులు - విద్వాంసులు, జ్ఞానులు, యోగులు, మహాత్ములు అనేక నామములతో పిలుస్తారు. ఆ నా ఒక్కోపేరు ఒక్కొక్క శక్తిని, ఒక్కొక్క గుణాన్ని సూచిస్తాయి. ఇంద్రుడు, మిత్రుడు, వరుణుడు, అగ్ని, దివ్యుడు, సుపర్ణుడు, గరుత్మంతుడు, యముడు, మాతరిశ్వుడు, గణపతి, బ్రహ్మ, విష్ణువు, శివుడు మొదలైన పేర్లన్నీ ఆధ్యాత్మిక ప్రకరణంలో నాకే వర్తిస్తాయి. భౌతిక ప్రకరణంలో లోకంలోని కొన్ని పదార్థాలకు, వ్యక్తులకు వర్తిస్తాయి. కనుక ప్రకరణాన్నీ - సందర్భాన్నీ గుర్తిస్తూ నేనిచ్చిన వేదాన్ని అర్థం చేసుకోవాలన్నాడు సృష్టికర్త.

## "గణపతి" అంటే

దేవుని అనేక నామములలో **'గణపతి'** నామము ఒకటి. ఈ పదము **"గణ-సంఖ్యానే"** అనే సంస్కృతమూల ధాతువుతో నిర్మింపబడింది. కనుక

లెక్కించతగిన కొన్ని పదార్థాలకు లేదా వ్యక్తులకు పతి - పాలకుడు, పోషకుడు, రక్షకుడు అని అర్థం వస్తుంది. ఆధ్యాత్మిక ప్రకరణంలో (దేవుని గూర్చిన సందర్భంలో) 'గణపతి' అంటే కోటానుకోట్ల జీవులకు, విశ్వంలోని సమస్త జడపదార్థాలకు పతి - పాలకుడు కనుక ఈ పేరు సృష్టిస్థితి లయకారకుడైన ఏకేశ్వరునికే వర్తిస్తుంది.

ఆధిభౌతికార్థంలో అంటే ప్రాణులపరమైన, మానవుల పరమైన సందర్భాలలో గణపతి అంటే - కొందరికి పతి (Group Leader) అని అర్థం వస్తుంది. అతడు రాజు కావచ్చు, సేనాపతి కావచ్చు, నేటి కాలాన్ని బట్టి దేశాధిపతి కావచ్చు, పార్టీ పతి కావచ్చు (సంస్థకు పతికావచ్చు)-అంటే వాటికి అధ్యక్షుడు (President) అన్నమాట. పూర్వం గురుకులాలు ఉన్నపుడు గురుకులపతిని, కులపతిని కూడా గణపతి అనేవారట. ఈ విషయం రాబోవు ప్రకరణాలలో వివరంగా తెలుసు కుందాము.

ఇక ఆధిదైవికార్థాన్ని గురించి ఆలోచిస్తే ప్రాణు లన్నిటిని పోషిస్తూ వసింపచేస్తాయి కనుక పంచభూతాలను - పృథివీ జల అగ్ని వాయురాకాశాలను, సూర్యచంద్ర నక్షత్రాలను గణపతులనవచ్చు. అయినప్పటికి వీటన్నిటిని మరియు సకల ప్రాణులనుకూడా కాపాడుతూ వాటికి మేలుచేస్తుంది కనుక అగ్నిహోత్రాన్ని గణపతి అనటం సమంజసంగా ఉంటుంది. ఎందుకంటే **"అగ్నిర్ వై దేవానాం ముఖమ్"**=అగ్నిహోత్రమే జడదేవతల కన్నిటికిని ముఖంగా - నోరుగా జీర్ణమండలంగా ఉంటుంది" కనుక ఈ విషయం తదుపరి ప్రకరణంలో వివరంగా తెలుసుకుందాము.

## దేవతలు ఎన్ని?

యజుర్వేదం దేవతలు 33 (త్రయస్త్రింశతా - 14-31) అంటుంది. వీటిని వివరిస్తూ మహర్షులు - **"పృథివ్యాదయో అష్టావసవః, ప్రాణాదయో దశవాయవః+జీవాత్మాచ, చైత్రాదయో ద్వాదశ మాసాః, విద్యుద్యజ్ఞశ్చ"** అంటూ 33గా లెక్కించారు.

దీనిని మరికొంత వివరిస్తూ - "భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అనే పంచ భూతాలు + సూర్య చంద్ర నక్షత్రాలు కలిసి 8 దేవతలు. వీటికి వసుదేవతలని పేరు. ఇవి ప్రాణులను వసింపచేస్తూ ఉంటాయి. ప్రాణ,

అపాన, వ్యాన, ఉదాన, సమానములనబడే పంచ ముఖ్య ప్రాణవాయువులు నాగ, కూర్మ, కృకల, దేవదత్త, ధనంజయము లనబడే 5 ఉపప్రాణాలు కలిసి దశవాయువులుగా లెక్కించాలి. వీటితో జీవాత్మను కూడా కలిపితే 11 అవుతాయి. వీటికి రుద్ర దేవతలని పేరు. ఎందుచేతనంటే ఇవి శరీరాన్ని వదిలిపెట్టి వెళ్ళిపోతే (ప్రాణాలు, జీవాత్మ వెళ్ళిపోతే) ఆ శరీరం శవమైపోతుంది. దానితో బంధుమిత్రులంతా రోదిస్తారు. ఏడుస్తారు. కనుక (రుద-రోదనే) ఇవి 11 రుద్రదేవతలు. చైత్రము, వైశాఖము, జ్యేష్ఠము, ఆషాఢము అంటూ మనం వ్యవహరించే 12 తెలుగు నెలలకు ఆదిత్య దేవతలని పేరు. ఆదిత్యుడు - సూర్యుడు ఒక్కడే అయినా భూమి సూర్యుని చుట్టూ దీర్ఘవృత్తాకారంలో తిరుగుచుండుటవల్లా, ఉత్తర దక్షిణ ధృవాలు మార్పుచెందుతూ ఉండుట వల్లా ఈ పన్నెండు నెలలలో సూర్యుని తాపప్రకాశాలు ఒక్కటిగా ఉండకుండా కొంత కొంత భేదంగా ఉంటాయి. ఇట్టి ఉష్ణ ప్రకాశాలు కూడా ప్రాణి మనుగడకు అవసరమే. కనుక వీటిని ద్వాదశాధ్యిత్యులుగా లెక్కించాము. విద్యుత్ మరియు యజ్ఞము (అగ్నిహోత్రము) కూడా దేవతలే. విద్యుత్ అంటే మేఘాలలో ఏర్పడే మెరుపులు. అగ్నిహోత్రం వల్ల జల వాయువులు, భూమి శుద్ధమౌతాయి. ప్రాణులన్నిటికి మేలు జరుగుతుంది. కనుక అదియును దేవతయే". అని వివరించారు.

ఇక మనం మెరుపు దేవత ఎలా అవుతుందో అలోచిద్దాము. ఆకాశంలో మేఘాల రాపిడివల్ల -దగ్గరగా రావటంవల్ల ధన విద్యుత్ తో కూడిన మేఘాలలోని విద్యుత్, ఋణ విద్యుత్ గల మేఘాల లోనికి గెంతుతుంది (Jump) చేస్తుంది. అది మనకు మెరుపుగా కనబడుతుంది. ఆ రాపిడిశబ్దం మనకు కొద్ది ఆలస్యంగా ఉరుముగా వినబడుతుంది. ఇంతేగాక, ఈ మెరుపులవల్ల ప్రతి సంవత్సరం వందలకొలది టన్నుల నత్రజని భూమికి చేరి భూమిని సారవంతం చేస్తుందంటున్నారు ఆధునిక వైజ్ఞానికులు. అందుకే కాబోలు క్షణికంగా ఉండే మెరుపులను కూడా దేవత అంటాయి మన వేదశాస్త్రాలు. ఇది 32వ దేవత. 33 వది యజ్ఞము.

మనం అగ్నిహోత్రంలో వేసే ఆవునెయ్యి, మూలికలు, ధాన్యాలు, పప్పులు, కాయలు మొదలైన ఆహుతులవల్ల అందుండి వెలువడే వాయువులు

ప్రాణులకు పుష్టిని, ఆరోగ్యాన్ని, స్ఫూర్తిని కలిగిస్తాయి. వాయువులోని కాలుష్యాలను పోగొట్టి గాలిని శుద్ధిపరుస్తాయి. క్రమంగా మేఘాలలోనికి చేరి అందలి వాయురూపంలో ఉన్న నీటిని శుద్ధి చేస్తాయి. ఆ మేఘాలు వర్షించినపుడు భూమిని, దానిపై ఉండే నీటిని కాలుష్యరహితం (Purify) చేస్తాయి. తద్వారా ప్రాణులకు చాలా మేలు జరుగుతుంది. ఈ విషయాన్ని మన ఆదర్శ ఆప్తపురుషుడు శ్రీ కృష్ణుడు భగవద్గీత 3వ అధ్యాయంలో చక్కగా వివరించారు. వారి వివరణను వారి మాటలలోనే తెలుసుకుందాము రండు.

**సహ యజ్ఞాః ప్రజాసృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।**
**అనేన ప్రసవిష్యధ్వం ఏష వోఽస్త్విష్టకామధుక్॥**

సృష్ట్యాదిలో పరమేశ్వరుడు మానవులతో బాటు యజ్ఞాలను సృజించి ఇట్లుపదేశించాడు- ఓ మానవులారా! ఈ యజ్ఞాల ద్వారా మీ మీ కోరికలను నెరవేర్చుకోండి. ఇవి మీ కోరికలను తీర్చే కామధేనువులు.

**దేవా న్భావయతాఽనేన తే దేవా భావయన్తు వః ।**
**పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ ॥**

ఈ యజ్ఞాలతో దేవతలు భావన చేయబడతారు. అంటే, జడ దేవతలైన పృథివ్యాపస్తేజోవాయురాకాశాలు శుద్ధి చేయబడతాయి. ఆ విధంగా శుద్ధి చేయబడిన పంచభూతాలు మిమ్ము శుద్ధులుగా, ఆరోగ్యవంతులుగా, బలిష్ఠులుగా చేస్తాయి. ఈ విధంగా పరస్పరం భావన చేసుకుంటూ (శు ద్ధిచేసుకుంటూ) ఉత్తమ శ్రేయస్సును పొందండి.

**ఇష్టా న్భోగాన్హి వో దేవా దాస్యన్తే యజ్ఞ భావితాః ।**
**తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః ॥**

యజ్ఞాలతో భావన చేయబడిన దేవతలు మీకు కావలసిన భోగాలను - ఆహారాది జీవన నిర్వహణ సుఖాలను ప్రసాదిస్తాయి. ఆ విధంగా వాటినుండి ఉపకారం పొంది మరల వాటికి ఆహుతుల నివ్వకపోతే వారు సంపత్తిని దొంగిలించినవారు ఔతారు.

**యజ్ఞశిష్టాశినః సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ।**
**భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మకారణాత్ ॥**

యజ్ఞానంతరం మిగిలిన పదార్థాలను తినేవారు సర్వపాపాల నుండి విముక్తులౌతారు. అట్లుకాక, ఎవరు కేవలం తమకొరకే అన్నాదులను వండుకొని తింటారో వారు పాపమును మాత్రమే భుజించినవారౌతారు.

**అన్నాద్ భవంతి భూతాని పర్జన్యాదన్నసంభవః ।**
**యజ్ఞాద్ భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః॥**

పరిశీలించి చూస్తే - అన్నంవల్లనే ప్రాణులు జీవిస్తున్నాయి. అన్నం మేఘాలు వర్షించటంవల్ల ఉత్పన్నమౌతున్నది. మేఘాలు యజ్ఞాలవల్ల ఏర్పడుతున్నాయి. యజ్ఞాలు కర్మవల్ల జరుగుతున్నాయి.

**కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవం ।**
**తస్మాత్ సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥**

యజ్ఞకర్మ వేదజ్ఞానం వల్ల తెలిసింది. వేదం నాశరహితమగు అక్షరమగు పరబ్రహ్మవల్ల ప్రకటింపబడింది. అట్టి సర్వజ్ఞానమయమైన వేదం నిత్యం యజ్ఞం చేయమంటున్నది.

**ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।**
**అఘాయు రింద్రియారామో మోఘం పార్థ స జీవతి॥**

(భగవద్గీత. 3-10 నుండి 16)

పరమేశ్వరునిచే ఏర్పరచబడిన ఈ యజ్ఞచక్రమును ఎవరు అనుసరించరో వారు పాపులు, వ్యర్థముగా జీవించువారౌతారు.

పై వాక్యాలు 5,122 సంవత్సరాల పూర్వం యోగేశ్వర శ్రీకృష్ణునివి కాగా నేటి వైజ్ఞానికులు మరికొన్ని ఆశ్చర్యకరమైన విషయాలు వెలుగులోనికి తెచ్చారు. జర్మనీ, ఫ్రాన్స్, చిలీ, పోలెండు దేశాలలో అగ్నిహోత్ర ఫామ్స్ (వ్యవసాయ క్షేత్రాలు) నిర్మించి, ఏ విధమైన రసాయనిక ఎరువులు, పురుగు మందులు లేకుండానే ఎక్కువ దిగుబడిని సాధించారు. ఏ బయోజెనిటిక్స్ లేకుండానే (హైబ్రీడ్ పద్ధతులు లేకుండానే) పెద్దపెద్ద పండ్లు, కూరగాయలు

పండించారు. ఆశ్చర్యంగా 20 సె.మీ. పొడవు, 3.75 కి.గ్రా. బరువుగల బీట్రూట్ దుంపలు కూడా పండినవి.

ఇప్పుడు ఈ పరిశోధనలు 'మానవుల, జంతువుల ఆరోగ్యంపై అగ్నిహోత్ర ప్రభావం' అనే విషయంవైపు మరలాయి. మంచి ఫలితాలే వస్తున్నట్లు చెబుతున్నారు. ఏ యే వ్యాధులకు ఏ యే మూలికలు మిక్కిలి ప్రయోజనకరంగా ఉంటాయో పరిశోధించవలసి ఉంది. అందుచేత అగ్నిహోత్రం ఒక దేవతగా పరిగణిస్తాయి మన వేదశాస్త్రాలు. కనుక విద్యుత్ యజ్ఞములతో కలిసి జడదేవతలు 33 అయ్యాయి.

### యజ్ఞము (అగ్నిహోత్రం) ప్రజాపతి- విద్యుత్ (మెరుపు) ఇంద్రుడు

అగ్నిహోత్రాన్ని 'ప్రజాపతి' దేవతగా పేర్కొన్నారు మన ఋషులు. ఏలనంటే -అగ్నిహోత్ర వాయువులు విస్తరిస్తూ పక్షపాతంలేకుండా ప్రాణులన్నిటికి మేలుచేస్తాయి. దీనిలో వేసిన నెయ్యి వాయువుగా మారి ప్రాణులకు పుష్టిని కలిగిస్తుంది. వాయువులోని దోషాలను, విషాలను పోగొడుతుంది. తద్వారా ప్రాణవాయువుతో బ్రతికే ప్రాణులన్నిటిని పాలిస్తుంది, రక్షిస్తుంది. కనుక అది ప్రజాపతి. ప్రాణిగణములకు పతి. పాలన పోషణలు చేసే ప్రాణపతి. కనుకనే మేము అగ్నిహోత్రాన్ని 'అగ్నిహోత్ర గణపతి' అంటున్నాము. ఈ అగ్నిహోత్రంలో వేసే మూలికలు, కాయధాన్యాలు, పప్పుధాన్యాలు, ఎండిన ద్రాక్ష, ఖర్జూరం, కొబ్బరి, బాదం మొదలైనవన్నీ, స్థాలీ పాకాదులు కూడా ప్రాణిగణములకు మేలు చేసేవే. అవి వాతావరణ దోషాలను పోగొట్టి ఋతువుల క్రమాన్ని సరిచేస్తాయి. వాటిలో హెచ్చుతగ్గులు కలుగకుండా కాపాడుతూ ప్రాణులను పాలిస్తాయి. ఈ విషయాలను వివరంగా తెలుసుకోగోరువారు నా రచనలు అగ్నిహోత్రం 100% వైజ్ఞానికం, అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ (Chemical Analysis of Agnihotra) చదువగోరుచున్నాను.

ఇక విద్యుత్ (మెరుపు) ఇంద్రుడు ఎలా అవుతుందో తెలుసుకుందాము. విద్యుత్ అనే పదము మన వేదశాస్త్రాలలో అక్కడక్కడ కనబడుతుంది. అక్కడ దీని అర్థం మనం ఇప్పుడు వాడుకునే కరెంటు - ప్రవాహ విద్యుత్ కాదు. మెరుపులను పేర్కొనటానికే విద్యుత్ పదమును ప్రయోగించారు. దీనిని 33వ

దేవతగా లెక్కించారు. దీనిని 'ఇంద్ర' పదముతోనే పేర్కొనటం జరిగింది. ఇక్కడ మనం మరొక్క విషయం గుర్తించాలి. వేదపదములన్నీ యౌగికములు. అంటే – ధాత్వార్థాన్ని (Root Meaning ను) బట్టి మాత్రమే అర్థం చేసుకోవాలి. 'ఇంద్ర' పదము **"ఇది – పరమైశ్వర్యే"** అనే ధాతువుతో నిర్మించబడుతుంది. అంటే **"గొప్ప ఐశ్వర్యం గలవాడు"** అని అర్థం.

ఆధ్యాత్మికార్థంలో ఇంద్రపదము పరమాత్మకు, జీవాత్మకు కూడా అన్వయిస్తుంది. సృష్టిలోని సమస్త ఐశ్వర్యాలను సృజించినది, ధరించి పాలించుచున్నది దేవుడే కనుక దేవుడు ఇంద్రుడు. ఆ దేవుడు జీవుని కొరకు ఇంద్రియాలను నిర్మించి వాటికి స్వామిని(యజమానుని) చేశాడు కనుక జీవుణ్ణి కూడా ఇంద్రుడనవచ్చు. జీవుడు ఇంద్రియాలు అనే ఐశ్వర్యం గలవాడు. ఐశ్వర్యం అంటే కేవలం కరెన్సీయే కాదు. చాలా విలువైనవని అర్థం. దేవుని దయవల్ల మనకు ఇంద్రియాలన్నీ బాగున్నాయి. కనుక వాటి విలువ మనకు తెలియటం లేదు. వాటిలో ఏవైనా లేనివారికి, లేదా ఏ కారణంచేతనైన అవి చెడిపోయినవారికి తెలుస్తుంది వాటి విలువ. వ్యాధివల్ల ఏదైనా ఇంద్రియానికి ఆపరేషన్ చేయవలసివస్తే లక్షలు ఖర్చుపెట్టడానికి సిద్ధం అవుతాముకదా! 'ఇంద్ర' పదము ఆధిభౌతికార్థంలో (ప్రాణులపరమైన అర్థంలో) ఐశ్వర్యసంపన్నులైన రాజులకు, కోటీశ్వరులకు, ప్రపంచ కుబేరులుగా గణించేవారికి ఇది వర్తిస్తుంది. నేడు రాచరికవ్యవస్థ లేదు కనుక ప్రభుత్వాన్ని ఇంద్రుడనవచ్చు. అధిదైవికార్థంలో (జడదేవతల పరంగా) ఇది విద్యుత్ కు వర్తిస్తుంది. నేడు విద్యుత్ వల్ల కలిగే లాభాలేమిటో చూస్తున్నారు కదా! విద్యుత్ ఐశ్వర్య ప్రదాయిని; తాను ప్రకాశిస్తూ మనను ప్రకాశింపచేస్తుంది. అయితే మేఘాలలో ఏర్పడే మెరుపును ఇంద్రుడని ఎందుకన్నారో తెలియవలసి ఉంది.

మెరుపులవల్ల ఎంతో నక్షత్రజని భూమికి చేరుతుందని మనం పూర్వ పుటలలో తెలిసికున్నాము. ఇంతేగాక, వేదం మెరుపులవల్లనే మేఘాలు వర్షిస్తున్నాయంటుంది. ఆ వర్షాలు ప్రాణులకు అన్నం పెడుతున్నాయి, సంపదలనిస్తున్నాయి కనుక మెరుపులను ఇంద్రుడంటుంది వేదం. యాస్కమహర్షి తమ నిఘంటు శాస్త్రంలో ఇంద్రపదమునకు 13 నిర్వచనాలు

చెప్పారు. వాటిని అక్కడ చూడండి. అందులో విద్యుత్ - మెరుపు ఒకటి.

మెరుపులను గురించి ఆధునిక విజ్ఞానవేత్తలు మరొక విషయం చెబుతున్నారు. మెరుపులలో చాలా విద్యుత్ ఉంటుందట. ఆ విద్యుత్‌ను సేకరించి నిలువ చేసుకోగలిగితే విద్యుత్ సమస్యలన్నీ తొలగిపోయి, పుష్కలంగా విద్యుత్ మిగిలిపోతుందట. ఆ విద్యుత్తు వాహనాలకు, పరిశ్రమలకు వ్యవసాయానికి వాడుకుంటే దేశం ఎంతగానో ఐశ్వర్యవంతమౌతుందట. అయితే, ఆ టెక్నాలజీ ఇంకా రాలేదు. కనిపెట్టవలసి ఉంది.

యజ్ఞ విద్యుత్తులు దేవతలు కనుకనే నిత్యాగ్నిహోత్రంలో "ఓం ప్రజాపతయే స్వాహా, ఓం ఇంద్రాయ స్వాహా" అంటూ ప్రత్యేకంగా ఈ రెండు దేవతలకు ఆవునేతితో ఆహుతులిస్తారు. వీటిలో ప్రజాపతి దేవతయైన యజ్ఞాన్నే - అగ్నిహోత్రాన్నే మేము గణపతి - అగ్నిహోత్ర గణపతి అంటున్నాము. అయితే, నేడు లోక ప్రచలితమైయున్న పౌరాణిక గణపతి సంగతేమిటి? అట్టి ఆకారంగల గణపతి ఉంటాడా? అతని జన్మవృత్తాంతమేమి? గాణాపత్య సంప్రదాయమేమిటి? అనే ప్రశ్నలు చాలానే మనముందున్నాయి. వాటిని గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాము.

## పురాణాలలో గణపతి

అష్టాదశ (18) పురాణాలలోను సుమారు 10 పురాణాలలో గణపతి జన్మకథ లున్నాయి. విచిత్రమేమంటే 10 పురాణాలలోను 10 రకాలుగా ఉన్నాయి. వీటిలో మత్స్యపురాణంలోని కథయే-పార్వతి నలుగుపిండినుండి పుట్టిన కథయే లోక ప్రసిద్ధమయ్యింది. దీనితో శివపురాణంలోని కథ జోడించి నేడు వినాయక వ్రతకల్పంలో వ్రాయబడింది. బ్రహ్మవైవర్తపురాణం ప్రకారం - పార్వతి పుత్రప్రాప్తి కొరకు గంగానది ఒడ్డున సనత్కుమారుని పౌరోహిత్యంలో పుణ్యాకరత వ్రతాన్ని చేస్తూ ఒక సంవత్సరం వరకు విష్ణువును ఆరాధించగా ఆమెకు ఒక పుత్రుడు కలిగాడట. ఆ నవజాత శిశువును చూడటానికి సమస్త దేవతలు వచ్చారు. వారిలో శని దేవత కూడా ఉన్నాడు. అతడు భార్యాశాపగ్రస్తుడట. శనియొక్క చూపు పడగానే గణపతి తల తెగిపడిపోయినదట. అప్పుడు విష్ణువు పుష్పక భద్రనది ఒడ్డున నిద్రించుచున్న

ఒక ఏనుగు తల నరికి ఆ శిశువునకు అమర్చెనట. మరి, మత్స్య శివపురాణాలలోని లోకప్రచలిత జన్మవృత్తాంతం సత్యమా? బ్రహ్మవైవర్త పురాణాలలోని ఈ కథ సత్యమా? (శని దేవుని కథ ఏమంటే - శని యొక్క భార్య చాలా కాలం విష్ణువును ఆరాధించినా విష్ణువు అనుగ్రహించలేదట. దానితో ఆమెకు విపరీతమైన కోపమొచ్చి విష్ణువును ఏమీ చేయలేక తన భర్తనే శపించినదట. **"నీ చూపు ఎవరి మీద పడితే వారికి కీడు కలుగునుగాక"** అని భర్తను శపించింది. అత్త మీద కోపం దుత్తమీద - కుండమీద చూపించినట్లు). ఇట్టి వింత విడ్డూర కథలు పురాణాలలో కోకొల్లలుగా ఉన్నాయి. ఇవన్నీ వ్యాసమహర్షి ఒక్కరే వ్రాశారంటే ఎలా నమ్మాలి? ఆలోచించండి.

గణపతి జన్మవృత్తాంతాలు వేరువేరుగా ఉన్నట్లే అతని స్తుతులును విచిత్రంగా ఉన్నాయి. **"శ్రీగాణపత్య అథర్వణ శీర్షము"** అనే గ్రంథంలో గణపతి స్తుతి ఈ విధంగా ఉంది

ఓం **నమస్తే గణపతయే - త్వమేవ ప్రత్యక్షం**
**తత్వమసి త్వమేవ కేవలం కర్తాసి, త్వమేవ కేవలం**
**బ్రహ్మాసి, త్వం బ్రహ్మాత్వం విష్ణుస్వం రుద్రస్త్వమింద్రస్త్వ**
**మగ్నిస్త్వం వాయుస్త్వం సూర్యస్త్వం చంద్రమాస్త్వం**
**బ్రహ్మ భూర్భువః స్వరోమ్॥**

దీనర్థం మనకు తేలికగానే అర్థమౌతున్నది. సృష్టి స్థితి లయ కర్త గణపతియే అనియు; అతనికే విష్ణువు, రుద్రుడు, ఇంద్రుడు, అగ్ని, వాయువు, సూర్యుడు, చంద్రుడు, బ్రహ్మ, భూః, భువః, స్వః, ఓమ్ అను అనేక నామములున్నాయంటూ వేదప్రతిపాదిత పరమేశ్వరుని వర్ణనకు సరిపోతున్నది. ఆ గ్రంథంలోనే దీనికి భిన్నంగా మరొకచోట ఒక వింత వికార మానవాకారంగా వర్ణింపబడింది చూడండి-

ఏకదంతాయ విద్మహే, వక్రతుండాయ ధీమహి, తన్నోదంతీ ప్రచోదయాత్॥ అంటూ ఒక కల్పిత గాయత్రీ మంత్రంగా కీర్తిస్తూ -ఏక దంత చతుర్హస్తం పాశమంకుశ ధారిణమ్ దదంచ వరదం హస్తైర్బిభ్రాణం

**మూషక ధ్వజమ్. రక్తం లంబోదరం శూర్పకర్ణకం రక్తావసనమ్ రక్తగంధానులిప్తాంగం - రక్త పుష్పైః సుపూజితమ్......... నమో వ్రాతపతయే, నమో గణపతయే నమః ప్రమద పతయే నమస్తే అస్తులంబోదరాయైకదంతాయ విఘ్ననాశినే శివసుతాయ శ్రీవరద మూర్తయే నమః॥**

అని కీర్తిస్తూ మనం నేడు లోకంలో చూచే వినాయక విగ్రహాకారంగా ఏక దంతము, వంకరముఖము, నాలుగు చేతులు, పెద్ద కడుపు, పెద్ద చెవులు, ఎర్రని వస్త్రాలు, ఎర్రచందన లేపనము గలిగి ఎర్రని పూలతో పూజింపబడేవానిగా వర్ణింపబడింది. వీటిని పరిశీలించి చూస్తే ఇది అగ్నిహోత్రానికి ప్రతీకగా కల్పించబడిన ఒక శిల్పి చమత్కారం. ఇక మనం ముందుగా ప్రతీక అంటే ఏమర్థమో తెలుసుకొని అగ్నిహోత్ర గణపతిని గురించి ఆలోచిద్దాము.

## ప్రతీకలు - ప్రత్యాయనీయాలు

ప్రతీకలు - ప్రత్యాయనీయాలు అనే రెండు పదములు పారిభాషక పదములు. ప్రతీక అంటే 'అంశము' అని సామాన్యార్థం. కాని, శాస్త్రాలలో ప్రకరణాన్ని బట్టి ప్రతీక పదానికి చిహ్నము, గుర్తు, ఉపమానము అనే అర్థాలు వస్తాయి. కవులు, కళాకారులు తమ తమ భావాలను కవితల ద్వారా, చిత్రాల ద్వారా తెలియపరుస్తారు (నాట్యకారులు తమ హస్తాలద్వారా, వ్రేళ్ళద్వారా సూచించి నట్లు). వారి కాల్పనిక భావాల వెనుక ఒక దివ్యమైన సందేశముంటుంది. పరమకవియైన సృష్టికర్త కూడా తన అమరకావ్యమైన వేదాలలో ప్రతీకల ద్వారానే - ఉపమానాల ద్వారానే మానవులకు తన సందేశాలను తెలిపాడు.

ఉదాహరణకు -

1. "స్వస్తి పంథామనుచరేమ సూర్యాచంద్రమసావివ" ఋగ్వేదం (5-51-15)

సూర్య చంద్రులవలె మీరు స్వస్తిమార్గాన సామాజిక జీవనం గడపండి.

2. **"అన్యో౽న్యమభి హర్యత, వత్సం జాతమివాఘ్న్యా"** అథర్వవేదం (3-30-1)

నవజాత వత్సమును(దూడను) గోమాత ప్రేమించునట్లు సామాజిక జీవనంలో మీరు ఒండొరులను ప్రేమించుకోండి. ఆదరించుకోండి.

ఇచట సూర్యచంద్రులు, గోవత్సములు ప్రతీకలుగా ఉన్నాయి. ఆ ప్రతీకలలోని సందేశాన్ని గ్రహించి మనం ఆ రకంగా సామాజిక జీవనం గడపటాన్నే ప్రత్యాయనీయమంటారు. అట్లే లోకంలో మనకు కనబడే న్యాయాలయాలలోని సున్ని తపుత్రాసు ఒక ప్రతీక. అది అక్కడ సరియైన న్యాయం జరుగుతుందని సూచిస్తుంది. అది ఆ ప్రతీకకు ప్రత్యాయనీయం. అట్లే, మన త్రివర్ణ జాతీయ పతాకం, కమ్యూనిష్టుల జండాపైన సుత్తికొడవలి ప్రతీకలు. ఇవి మనకు **'త్యాగం, శాంతి, సౌభాగ్యాలు'**, **'కార్మిక కర్షక సంక్షేమాలు'** అనే ప్రత్యాయనీయాలను గుర్తుచేస్తున్నాయి. ప్రతీకలు మనకు కనబడతాయి, ప్రత్యాయనీయాలు కనబడవు. మనం వాటిని బుద్ధితో ఆలోచించి గ్రహించాలి. యాజ్ఞవల్క్యమహర్షి తన శతపథబ్రాహ్మణంలో అగ్నిహోత్రాన్ని ఒక ప్రతీకగా తీసుకొని దానివలె మీరు నిజ జీవితాన్ని గడపమంటాడు. అగ్నిహోత్రం మనకు తనవలె పక్షపాతరహితంగా ప్రాణులన్నిటికి మేలుచేసే కార్యాలు చెయ్యమంటుంది. యజ్ఞమయ జీవితం గడుపమంటుంది. అట్లే అగ్ని ప్రతీక - శ్రద్ధ ప్రత్యాయనీయం; ఆజ్యం (నెయ్యి) ప్రతీక - సత్యం ప్రత్యాయనీయం అంటాడు. ఈ విధంగానే ఘృతం, సమిధలు, ఆహుతులు, యజ్ఞవేది మొదలైనవన్నీ ప్రతీకలుగా ఉండి మనకు మౌనంగా సందేశాలను - ప్రత్యాయనీయాల నిస్తున్నాయంటాడు యాజ్ఞవల్క్యమహర్షి. ఈ విషయం చాలా పెద్దది. వివరంగా తెలుసుకోగోరువారు నా రచన **"అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపం"** చదవండి. అట్టి మహిమాన్విత అగ్నిహోత్రానికి గణపతి విగ్రహం ప్రతీక. ఇది ఒక సూక్ష్మ విషయం. జాగ్రత్తగా చదివి అర్థం చేసుకునే ప్రయత్నం చెయ్యండి.



గణపతివిగ్రహం ప్రతీక



అగ్నిహోత్ర గణపతి

మనం పూర్వం తెలుసుకొన్న ఋగ్వేద గణపతిమంత్రానికి దేవత బ్రహ్మణస్పతి. దానికి మనం అక్కడ బ్రహ్మాండాధిపతి అని చెప్పుకున్నాము.

దీనికి యజ్ఞము యొక్క స్వామి, ధనము యొక్క స్వామి అనే మరి రెండు అర్థాలు కూడా చెప్పబడ్డాయి. అందుచే ఆ మంత్రం యజ్ఞ మహిమనుకూడా బోధిస్తున్నదన్న మాట. వాస్తవంగా అగ్ని అంటే యజ్ఞమే. **'అగ్నిరేవ యజ్ఞః'** అంటుంది శతపథ బ్రాహ్మణం (3-2-2-1). ఇంతేగాక, **"ఏష వై ప్రత్యక్షం యజ్ఞో యత్ ప్రజాపతిః"** (4-3-4-3). ఈ యజ్ఞాన్నే ప్రజాపతి అని కూడా అంటారంటుంది. మనం పూర్వ పుటలలో చెప్పుకున్నట్లుగా అగ్నిహెూత్రం వాతావరణాన్ని శుద్ధిచేసి, మేఘాలను ఆకర్షించి వర్షింపజేసి ప్రజలను, ప్రాణులను పాలిస్తుంది, పోషిస్తుంది. కనుక అదియును ప్రజాపతియే. **"అగ్నిర్వై ధూమ్రో జాయతే, ధూమ్రా దభ్రమాద్ వృష్టిం"** అంటుంది శతపథ బ్రాహ్మణం (4వ అధ్యాయం).

ఆలోచించి చూస్తే పౌరాణిక గణపతి యొక్క వివిధ నామాలు, విశేషణాలు అగ్నిహెూత్ర ఫలితాలనే సూచిస్తున్నాయి. ఎవరో కళాకారుడు అగ్నిహెూత్రంవల్ల కలిగే లాభాలను తెలుపుటకు ఒక చిత్రంగా (కార్టూన్‌గా) గణపతి ఆకారాన్ని కల్పనచేసి చిత్రించాడేమో ననిపిస్తుంది. దానిని ఒక శిల్పకారుడు ఒక విగ్రహంగా రూపొందించి ఉంటాడు. విగ్రహ ఆకారం యజ్ఞకుండాన్ని పోలి ఉంటుంది. పౌరాణిక స్తుతిలో గణపతి రక్తవర్ణుడని, రక్తవర్ణవస్త్రధారి యనీ చెప్పబడింది. అగ్ని ఎఱ్ఱనిరంగు కలిగి రక్తంవలె ఉంటుందికదా! మరి యొక పేరు లంబోదరుడు అంటే పెద్ద కడుపు కలవాడని అర్థం. పృథివ్యాది పంచభూతాలలోనూ, మిగతా దేవతలలోనూ అగ్నికే పెద్ద కడుపు ఉంది. నెయ్యి మొదలైన హవ్య ద్రవ్యం ఎంత వేసినా తిని - భస్మంచేసి జీర్ణంచేసుకొనే శక్తి దానికుంది. మిగతా ప్రాకృతిక దేవతలనూ ఆ శక్తి లేదు. అందుచే అగ్నిహెూత్రం లంబోదరుడు. పూర్వం చెప్పుకొన్నట్లుగా కేవలం అది తినటమేగాక వాయువు ద్వారా మిగిలిన దేవతలన్నిటికి అందచేస్తుంది. అందుకనే వాయువును **"హవ్యవాహన!"** అని కావ్యాలలో సంబోధింపబడింది.

గణపతిని వక్రతుండుడు అంటారు. అగ్ని శిఖలు వంకర టింకరగా ఉంటాయి కదా! ఇక ధూమకేతు సంబోధనను గురించి ఆలోచిద్దాము. ధూమము అంటే పొగ. ధూమకేతువు అంటే పొగను జండాగా కలవాడని అర్థం వస్తుంది. దూరం నుండి ఒక కార్యాలయాన్ని దాని పైన ఎగురుతున్న

జండాను బట్టి అది ఏ ప్రభుత్వ కార్యాలయమో గుర్తిస్తాము. అట్లే, ఎక్కడైనా దూరంగా పొగ కనబడితే అక్కడ అగ్ని ఉన్నట్లు, ఏదో కాలుతున్నదని గుర్తిస్తాము. కనుక **ధూమకేతు** నామముకూడా అగ్నిహోత్రానికే అన్వయిస్తుంది. అగ్నికాక మరెవరు ధూమాన్ని కేతువుగా - జండాగా కలిగి ఉంటారు? అగ్ని ద్విమాత్రుడని కొన్ని పురాణాలలో వ్రాయబడింది. పూర్వం అగ్ని హోత్రంలో అగ్నిని వెలిగించటానికి రెండు అరణులను రాపిడిచేసి అగ్నిని రగిలించేవారు. రెండు అరణు లనే తల్లినుండి అగ్నిహెూత్ర గణపతి పుట్టాడన్నమాట.

ఋగ్వేదం (1-31-2) లో **"త్వమగ్నే అంగిరసతమః......... ద్విమాతా శయుః కతిధా చిదాయవే॥"** - అంటూ పృథివీ అంతరిక్షాలు అగ్నికి తల్లులంటుంది. కనుక అగ్నిహెూత్ర గణపతి ద్విమాత్రుడు.

గణపతికి మూషిక వాహనుడని మరియొక పేరు. తైత్తరీయ సంహిత (1-1-3-3) లో "పృథివి సూర్యుని నుండి వేరైనపుడు దానిపైన అగ్ని ఉండేది. కాలక్రమంలో ఆ అగ్ని మూషికమువలె (ఎలుకవలె) పృథివిలోనికి వెళ్ళిపోయింది" అని చెప్పబడింది. మరొకచోట గణపతిని మయూరవాహనుడని కీర్తించారు. మహర్షి దయానందులవారు అగ్ని పదమునకు ఆధిదైవికార్థం వ్రాస్తూ అగ్నివిద్య, అశ్వవిద్య, నౌకా విమానాది యానవిద్య అని గ్రహించాలన్నారు. అందువల్ల మూషికం పృథివిపై నడిచేదానికి సంకేతంగాను, మయూరం పృథివిపై మరియు ఆకాశంలో విహరించటానికి సంకేతంగాను తీసుకోవాలని విద్వాంసులు వ్యాఖ్యానించారు. గణపతి మహాదేవుని కొడుకంటారు. అథర్వవేదం (18-4-4)లో సూర్యుని మహాదేవుడని చెప్పబడింది. సూర్యుని నుండే అగ్నిపుట్టింది కదా! గణపతిని వినాయకుడంటారు. వినాయకుడంటే విశేషనాయకుడని అర్థం. కారక సంహిత "**అగ్నిర్వై దేవానాం సేనాని**" అంటుంది. ఈ విధంగా ఆలోచిస్తే గణపతి విశేషణాలన్నీ అగ్నిహెూత్ర గణపతికి వర్తిస్తాయి.

అక్కడక్కడ పంచముఖి గణేశుని వర్ణన ఉంది. యజ్ఞపదము కేవలం అగ్నిహెూత్రానికే సీమితంకాదు. బ్రహ్మయజ్ఞం(సంధ్యావందనం), దేవయజ్ఞం (అగ్నిహెూత్రం), పితృయజ్ఞం(జీవిత మాతా పితరులకు, ఆశ్రిత బంధుమిత్రులకు సేవ చెయ్యటం), అతిథియజ్ఞం (విద్వాంసులైన సన్న్యాసులను, మహాత్ములను సేవించటం) బలివైశ్వదేవయజ్ఞం(ఆశ్రిత గో అశ్వాది పశువులను, పనివారిని తగిన భోజన పానీయాదులతో తృప్తిపరచటం) -ఈ అయిదింటిని

పంచ మహాయజ్ఞాలంటాయి వేదశాస్త్రాలు. పంచముఖి గణపతిని పూజించటం, సేవించటం అంటే - శ్రద్ధా భక్తులతో ఈ పంచ మహాయజ్ఞాలు నిత్యం చెయ్యటం. ముఖ్యంగా గృహస్థులు వీటిని ఆచరించాలి...

## నేడు అగ్నిహోత్రం సంకుచితమై దీపారాధన అయ్యింది. ప్రతీకలు దేవుళ్ళయ్యాయి.

సృష్ట్యాదినుండి మహాభారతకాలం వరకు మన దేశంలో అగ్నిహోత్రానికి గొప్ప మాన్యత ఉండేది. గృహస్థులు నిత్యం పంచమహా యజ్ఞాలు చెయ్యటమేకాక పౌర్ణమి అమావాస్యలకు, పండుగలకు విశేషహోమాలు చేసేవారు. ప్రతీ శుభకార్యాన్ని అగ్నిహోత్రంతో ఆరంభించేవారు. క్రొత్త పంటలు ఇంటికి వస్తే విశేషంగా "నవసస్యేష్టి" మంత్రాలతో వాటిని కొంత అగ్నిహోత్రంలో ఆహుతులుగా యిచ్చి అనంతరమే వారు భుజించేవారు. గర్భాధాన పుంసవన సీమంతోన్నయన జాతకర్మ నామకరణాది 16 సంస్కారాలను అగ్నిహోత్ర పూర్వకంగానే జరుపుకునే వారు. ప్రపంచయుద్ధంలాంటి మహాభారత యుద్ధంవల్ల చాలా చాలా నష్టమే అయ్యింది. సిరిసంపదలేకాక సంస్కృతి, సభ్యతలు సన్నగిల్లాయి. ధర్మాధర్మాలను, కర్తవ్యాకర్తవ్యాలను తెలిపే విద్వాంసులు, మహాత్ములు కరువయ్యారు. దానితో వేదవిరుద్ధ సంప్రదాయాలు పుట్టుకొచ్చాయి.

శ్రేష్ఠతమ సత్కర్మగా కీర్తింపబడిన అగ్నిహోత్ర కార్యంలో అపశ్రుతులు చోటుచేసుకున్నాయి. అధ్వరమైన (హింస ఏమాత్రం లేని) అగ్నిహోత్రం హింసా భరితమయ్యింది. వేదమంత్రాలకు విపరీతార్థాలు వ్రాసి మేకలను, ఆవులను, అశ్వాలను యూపస్తంభాలకు కట్టి వేదమంత్రాలు చదువుతూనే ఆ జంతువులను బలిహింసలకు గురిచేసి చంపి, వాటి మాంసంతో ఆహుతులిచ్చారు. సోమపానం పేరుతో సురాపానం చేశారు. క్రమంగా వామమార్గం బలపడిపోయి ప్రజలు మద్యమాంసాహారు లయ్యారు. వ్యభిచరించేవారు. ఆ వికార విలాస జీవితాలకు విరుద్ధంగానే బౌద్ధ జైన మతాలు పుట్టుకొచ్చాయి. వివేకం జాగృతమయ్యింది. ప్రజలంతా మహాత్ములైన బుద్ధునికి, జినమునికి అనుయాయులయ్యారు. దానితో అగ్నిహోత్రం సంకుచితమై దీపారాధనగా మిగిలిపోయింది. సృష్టికర్త యిచ్చిన సత్యవేదజ్ఞానం, దర్శన ఉపనిషదాదుల తార్కిక జ్ఞానం కనుమరుగై శైవ వైష్ణవాది సంప్రదాయాలు చాలానే పుట్టుకొచ్చాయి. వాటిలో గాణాపత్య సంప్రదాయం ఒకటి.

# గాణాపత్య సంప్రదాయం

గాణాపత్యము లేదా గాణపత్యము అనబడే ఈ సంప్రదాయం 5 నుండి 8 శతాబ్దాల మధ్యకాలంలో ప్రచలితమైయుండేది. శైవులు శివలింగాన్ని, వైష్ణవులు చతుర్భుజ విష్ణుమూర్తిని, శాక్తేయులు మహంకాళిని కల్పనచేసి పూజించినట్లే ఈ గాణపత్యులు గణపతి విగ్రహాన్ని కల్పన చేసి పూజించేవారు. ఈ సంప్రదాయం మన దేశంలోనే కాక విదేశాలకును ప్రాకింది. చైనాలోని కుంగ్ శియాంగ్‌లో క్రీ.శ. 531 సంవత్సరంనాటి గణేశ విగ్రహం లభించింది. అఫ్ఘనిస్తాన్లో 6వ శతాబ్దంనాటి పాలరాతి గణేశుని విగ్రహం ఉంది. సుమారు 40 సంవత్సరాల క్రిందట లాఓస్ ప్రభుత్వం గణేశుని చిత్రంతో తపాల బిల్లలు విడుదల చేసింది. న్యూయార్క్ టొరెంటో మరియు జర్మనీలో గణపతి ప్రాచీన మందిరాలున్నాయి. నేపాల్, టిబెట్, జపాన్, ఇండో చైనా, స్యామ్, బర్మా, మలయా, జావా, బోర్నియా, సుమిత్రా మొదలైన కొన్ని దేశాలలో గణపతి ప్రతిమలు దొరికాయట.

గణపతి విగ్రహం అగ్నిహోత్రానికి ప్రతీక అయినట్లే బ్రహ్మ, విష్ణు, మహేశ్వర దేవీ విగ్రహాలును ప్రతీకలే. వాటి వెనుక కూడా బుద్ధితో ఆలోచించి గ్రహించవలసిన ప్రత్యాయనీయాలున్నాయి. వాటిని గురించి మరియొక పుస్తకంలో తెలుసుకుందాము. ప్రత్యాయనీయాలు లుప్తమైపోయి ప్రతీకలు మిగిలాయి. వాటిని కొందరు స్వార్థపరులు దేవుళ్ళను చేశారు. ఆ ప్రతీకల పేరుతో పురాణాలు వ్రాసి వాటిని తాము వ్రాశారంటే ప్రజలు నమ్మరని పురాణాలన్నీ వేదవ్యాస మహర్షులే వ్రాశారని ప్రచారం చేశారు. అమాయక ప్రజలు వాటిని నమ్మటం మొదలు పెట్టారు. దీనిని అసరాగా తీసుకొని పురాణాలకు తగినట్లు విగ్రహాలను నిర్మించి, గుళ్ళూ గోపురాలు కట్టారు. వ్రతకల్పాలు వ్రాసి షోడశోపచార పూజలు చేయించారు. సుప్రభాతాలు వ్రాశారు. వేదాంత దర్శనంవంటి గొప్ప తార్కిక గ్రంథం వ్రాసిన వేదవ్యాస మహర్షులవారు ఈ పుక్కిట పురాణాలు వ్రాశారంటే విడ్డూరంగానే ఉంది.

ఇంతటితో ఆగిపోకుండా పురాణాలకు ఉపపురాణాలు సృష్టించారు. క్షేత్ర మహాత్మ్యాలు వ్రాసి ఆ యా క్షేత్రాలకు భక్తుల నాకర్షించి దక్షిణలు దండుకున్నారు. వాటిని చిలువలు పలువలుచేసి క్రొత్త క్రొత్త దేవీ దేవతలను సృష్టించారు. గణపతి కూతురు సంతోషిమాత అన్నారు. హరి హరుల కలయికతో అయ్యప్ప స్వామి పుట్టాడన్నారు. నారాయణునికన్న

సత్యనారాయణుడు తేలికగా ప్రసన్నమై వరాలవర్షం కురిపిస్తాడన్నారు. ఆ యా క్రొత్త దేవీ దేవతలకు వ్రతకల్పాలు, అష్టోత్తర శతనామాలు సుప్రభాతాలు తయారుచేశారు. ఆ క్రమంలోనే అగ్నిహోత్ర ప్రతీకలైన గణపతి మూర్తికి వివిధ రూపాలు కల్పించి పూజిస్తున్నారు. అట్టహాసంగా నవరాత్రులు చేసి సామూహిక నిమజ్జన కార్యక్రమాలు చేస్తున్నారు.

## గణపతి నిమజ్జనం ఒక ప్రహసనం

వేదాల వెలుగులో మన ప్రాచీన ఋషులు సృష్టి క్రమాన్ని ఉపనిషదాదులలో చాలా చక్కగా వివరించి చెప్పారు. ఆ ప్రకారం ఈ సృష్టి మూల ప్రకృతి నుండి క్రమ పరిణామం చెందుతూ ముందు మహత్త్వ, అహంకార పంచతన్మాత్రలు వరుసగా పుట్టాయి. అనంతరం పంచతన్మాత్రల నుండే పంచభూతాలు పుట్టాయి. అవి ఏ క్రమంలో పుట్టాయంటే - **"తస్మాద్ వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః, ఆకాశాద్ వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః, పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యో అన్నమ్, అన్నాద్ రేతః, రేతసః పురుషః, స వా ఏష పురుషో అన్నరసమయః॥"** - తైతరీయ ఉపనిషత్ బ్రహ్మానందవల్లిలో ఒకటవ అనువాకం.

పంచతన్మాత్రలనుండి ముందుగా ఆకాశభూతం ఏర్పడింది. అనంతరం వాయువు, తదుపరి అగ్ని, అనంతరం జలం, తదుపరి భూమి, వృక్ష జాతులు, ఆహారం, ప్రాణులు పుట్టాయి అంటే ఏర్పడ్డాయన్నమాట.

పూర్వం మా చిన్నతనం వరకు కూడా పూజగణపతులను మట్టితోటే చేసేవారు. పూజ అనంతరం వాటిని కాలువలలోనో, చెరువులలోనో ఎవరి అనుకూలం ప్రకారం వారు మరునాడు లేదా 2,3 రోజుల తరువాత నిమజ్జనం చేసేవారు. దానికి ఏ అట్టహాసం ఉండేది కాదు. పై ఋషివాక్యాలలో జలం నుండి పృథివి ఏర్పడిందని చెప్పబడింది. మట్టికి తల్లి నీళ్ళు అన్న భావంతో కావచ్చు ఆ విధంగా చేసేవారు. లేదా పొలాలలో వేస్తే కాలితో త్రొక్కుతారేమో నని నీటిలో వేసే ప్రథ ఏర్పడి ఉండవచ్చు. కాని, నేడు గణపతులను ప్లాస్టర్, ఆఫ్‌పారిస్, రంగులు, రసాయనాలతో నిర్మిస్తున్నారు. అటువంటి వాటిని నీటిలో వెయ్యటం మంచిది కాదు. అందువల్ల జలము, తదుపరి వాయువు కలుషితమౌతాయి. అగ్నిహోత్ర గణపతిని ఆ విధంగా చెయ్యకూడదు. అగ్నిని

నీటిలో వేస్తే దాని అస్తిత్వమే సమాప్తం అవుతుంది కదా! వేదమంత్రాలను సరిగా అర్థం చేసుకోనందున కూడా ఈ పొరబాటు ప్రారంభమై ఉండవచ్చు. ఋగ్వేదం 18-102-5 లో "అగ్నిం సముద్రవాససమ్" అనే వాక్యం, అట్లే ఋగ్వేదం 10-46-1లో "సీదద్+అపామ్+ఉపస్థే" అనే వాక్యం కనబడతాయి. వీటి భావమేమంటే - "అగ్ని సముద్రంలో వసిస్తుంది, నీటిలో కూర్చుంటుంది" అని. అయితే నీటిలో ఉండే అగ్ని మన వంటింట్లో ఉండే సామాన్య అగ్నివంటిది కాదు. అది ఒకరకమైన విద్యుదగ్ని. దానిని వేదం "విశ్వ శంభువాగ్ని" అంటుంది. ఈ క్రింది మంత్రాన్ని పరిశీలించండి-

ఓం **అప్సుమే సోమో అబ్రవీత్ + అంతర్విశ్వాని భేషజా ।**
**అగ్నిం చ విశ్వశంభువమ్ ఆపశ్చ విశ్వభేషజీః ॥**

- ఋగ్వేదం (1-23-20)

నాతో సోముడు (సృష్టికర్తయైన పరమేశ్వరుడు) "జలంలో సమస్త రోగాలను పోగొట్టగల రోగనివారక శక్తులున్నాయి. మరియు దానిలో విశ్వశంభువాగ్ని (ఒకరకమైన విద్యుత్) ఉంది. అందుచే జలం విశ్వభేషజం" అన్నారని ఒక ప్రకృతి వైద్యుడు చెప్పినట్లుంది. ఈ మంత్రం. నిజంగా జలంతో చికిత్సలు (Hydratherapy) చేసి చాలా రోగాలు పోగొట్టవచ్చు. వివరాలు నా రచన **"వేదాలలో జలచికిత్సా విజ్ఞానం"** అనే పుస్తకంలో చూడండి.

బహుశః విశ్వశంభువాగ్ని అంటే - నీటిలో ఉన్న ఉదజనిని (హైడ్రోజన్ను) వేరు చేసి దానితో వాహనాలను, పరిశ్రమలను నడిపించటం కావచ్చు. ఆ మధ్య దినపత్రికలలో ఒక యువ విజ్ఞానవేత్త నీటితో చిన్న కారు నడిపారని వార్త. ఆ టెక్నాలజీతో బహిర్గతమయ్యేదే విశ్వశంబువాగ్ని కావచ్చు.

మనకు సరిగా తెలియటం లేదుకాని సముద్రంలో ఏదో అగ్ని ఉంది. మన ఇతిహాస గ్రంథాలలో అక్కడక్కడ 'బడబానలం' అనే మాట కనబడుతుంది. 'బడబానలం' అంటే సముద్రాగ్ని అని అర్థం. కొన్ని అరుదైన పరిస్థితులలో అది వ్యక్తమౌతూ ఉంటుందట. నా అనుభవంలోని ఒక విషయం ఏమంటే - సుమారు 30 సంవత్సరాల క్రిందట కృష్ణాజిల్లా సముద్రతీర ప్రాంతంలో జరిగిన ఉప్పెన బీభత్సం తరువాత రెండవ విడత సహాయక బృందంలో

నేను కూడా పాల్గొని ఆ ప్రాంతం సంచరించాను. అక్కడివారు ఆనాటి అనుభవాలను చెబుతూ ఉప్పెన సమయంలో సముద్రంలో ఎత్తైన కెరటాలు లేవటమేకాక ఊర్లు తగులబడుతున్నటు దూరంగా పెద్దపెద్ద అగ్ని జ్వాలలు కనబడ్డాయన్నారు. అవి పిడుగులు కాకపోవచ్చు. పిడుగు క్షణకాలమే ఉంటుంది కదా! ఇంతేగాక అక్కడి తీరప్రాంత మత్స్యకారులు కొందరు ఆ సమయంలో ఆ రాత్రంతా సముద్రంలో ఈదుతూ గడుపవలసి వచ్చిందట. వారు బడబానలాగ్నిని స్వయంగా చూశామనీ, అప్పుడు ఆ సముద్రజలం గోరువెచ్చగా ఉందనీ, ఆ కారణంగానే భయంకరమైన చలిగాలులు వీస్తున్నా చలిని తట్టుకుని బ్రతికి బయటపడ్డామని చెప్పారు. అప్పుడు ఈ విషయాలు కొన్ని దినపత్రికలలో వచ్చాయి. కాని, ఆధునిక వైజ్ఞానికులకు ఇంతవరకు కూడా బడబానలాగ్ని అంటే ఏమిటో అర్థం కావటం లేదు.

ఇక గణేశ నిమజ్జన విషయానికి వస్తే మన పెద్దలు స్వతంత్ర సంగ్రామం చేసే సమయంలో మాన్యశ్రీ బాలగంగాధర తిలక్ గారు హిందువుల సామూహిక బలాన్ని ఆంగ్లేయులకు చూపటానికి బొంబాయి నగర ప్రజలను సామూహిక నిమజ్జన కార్యక్రమం జరుపుకుందామనే పిలుపునిచ్చారు. దానికి చాలా చక్కటి స్పందన లభించి జయప్రదమయ్యింది. అప్పటి నుండి అది ఇక ముఖ్య ఆచారంగా స్థిరపడి క్రమంగా మహారాష్ట్ర, కర్ణాటక రాష్ట్రాలకు, తెలంగాణాలోని హైదరాబాదు ప్రాకింది. ఇప్పుడిప్పుడు ఆంధ్రా తమిళనాడు రాష్ట్రాలలోని నగరాలకు, పట్టణాలకు ప్రాకుతున్నది. సత్యమైన ఆచారం వ్యాపించటానికి చాలా సమయం పడుతుంది – కాని మూఢనమ్మకాలు తొందరగా వ్యాపిస్తాయి కదా! దీనివల్ల ఎంతో అపవ్యయం, సమయనష్టం, ట్రాఫిక్ యిబ్బందులు కలుగుటయేకాక కొన్ని అధర్మ దోషాలు కూడా కలుగుతున్నాయి. పేద మధ్యతరగతి బస్తీ ప్రజలను బాధించి, భయపెట్టి చందాలు ప్రోగుచెయ్యటం, వాటిని విలాసాలకు, వ్యసనాలకు ఖర్చుపెట్టడం, వాతావరణ కాలుష్యాన్ని శబ్దకాలుష్యాన్ని పెంచటం వంటివి కలుగుతున్నాయి.

భక్తి అనేది ఆంతరంగికం. భగవద్గీతలోని 12వ అధ్యాయం భక్తి యోగం మనకు ఇదే బోధిస్తున్నది. అందులో ఉపదేశింపబడిన భక్తుని లక్షణాలు మనలో పెంచుకొని సర్వాంతర్యామియైన గణపతికి దగ్గరకావటం ఉత్తమం. వీలైనంత

ఎక్కువగా పరోపకారం చేస్తూ పుణ్యజీవులం కావటం మధ్యమం. వ్యాస మహర్షి తమ బృహత్ గ్రంథమైన మహాభారతంలో కోటి ధర్మ గ్రంథాలసారాంశం అర్ధ శ్లోకంలో చెప్పారు. వారు ఏమన్నారంటే -

"శ్లో॥ **శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః।**
**పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనమ్॥**

పుణ్యం కావాలనుకుంటే పరోపకారం చెయ్యండి. పాపం కావాలనుకుంటే పరులను పీడించండి" అన్నారు. కనుక వివేకవంతులు ఆలోచించండి. గణపతి నవరాత్రులకొరకు ఖర్చుపెట్టే ధనాన్ని సామాజిక సేవకు - అందరికి ఉపయోగపడే నిర్మాణాత్మక కార్యాలకు ఖర్చు పెట్టండి. ఆదర్శంగా జీవించి ఆత్మోన్నతిని పొందండి. అస్తు.

## విద్యా గణపతి - ఆచార్య గణపతి

మనం ఇంతవరకు గణపతి పదమునకు ఆధ్యాత్మికార్థంలో సర్వవ్యాపకుడు, అజుడు అనాదియైన పరమేశ్వరుడనీ, ఆధిదైవికార్థంలో- 33 రకాల దేవతలలో అగ్నిహోత్రకార్యమనీ తెలుసుకున్నాము. ఇక ఆధిభౌతికార్థాన్ని గురించి తెలుసుకోవలసి ఉంది. ఆధిభౌతికార్థం అంటే భూతముల పరంగా - ప్రాణుల పరంగా లేదా మానవుల పరంగా అని అర్థం. గణపతిలోని మూలార్థం(గణ - సంఖ్యానే) ఒక సమూహానికి పతి- పాలకుడు, రక్షకుడని పూర్వ పుటలలో తెలుసుకున్నాము. అట్టి మానవ సమూహంలో గణపతి విశేషణం ఆ దేశ రాజునకు వర్తిస్తుంది. ఇప్పుడు రాచరిక వ్యవస్థ లేదు కనుక ప్రభుత్వం అని అర్థం చెప్పుకోవాలి. అనంతరం సేనాపతులను భూ వాయు సముద్ర సేనాపతులను గణపతులన వచ్చును. వారు ఆ యా సైన్యసమూహానికి అధిపతులు కనుక. అట్లే, ఆ యా రాష్ట్రాల పతులను, సమాజాల సంఘాల సంస్థల అధిపతులు కూడా ఆ సీమిత సంస్థలకు గణపతులౌతారు. అందుకనే యజుర్వేద 16వ రుద్రాధ్యాయం రుద్రులు, గణపతులు అనేకులంటూ **"నమో గణేభ్యః గణపతిభ్యశ్చ వో నమః** (16-25)" అంటూ బహువచనంలో నమస్కారాలు చెబుతుంది.

గణతంత్ర దేశంలో గణాధ్యక్షుని - రాష్ట్రపతిని గణపతి అంటారు. శ్రీ గణేశ మహిమస్తోత్రంలో **"గణాధ్యక్షో జ్యేష్ఠః"** అని చెప్పబడింది. నేటి గణపతి

విగ్రహం ఒక ఆదర్శ గణాధ్యక్షునికి ప్రతీక. బుద్ధి వివేకాలు ఏనుగుతలవలె పెద్దగా ఉండాలనీ, ప్రజలందరి మాటలను శ్రద్ధగా వినాలని పెద్ద పెద్ద చెవులు సూచిస్తున్నాయి. చాలా తక్కువగా మాట్లాడాలని చిన్న నోరు, అధ్యక్షుడు మితభాషి కావాలి. నోరు జారితే చాలా చిక్కులొస్తాయి కుశాగ్ర బుద్ధి ఉండాలని పొడవాటి ముక్కు (తొండము) సూచిస్తాయి. కనుక ముక్కు ప్రతిష్ఠకు చిహ్నం. దానికి ఏదైనా హాని జరిగితే ముక్కు తెగినంత పని జరిగిందంటారు పెద్దలు. ఏనుగుకు రెండు రకాల దంతాలుంటాయి. 1. భయటకు కనబడేవి. 2. లోపల ఉండేవి (నమలటానికి). ఇవి కూటనీతిని సూచిస్తాయి. కౌటిల్యుని అర్థశాస్త్రం యిదే చెబుతుంది. గణేశుని విరిగిన దంతం అతని వీరత్వాన్ని సూచిస్తుంది. వీరుడు పోరాడేటప్పుడు శత్రువు చేతిదెబ్బలు కూడా కొన్ని తాను తినవలసి వస్తుంది కదా! లంబోదరము ప్రజలందరి కడుపులు నింపాలనీ, ధన కనక వస్తు వాహనాలన్నీ సమృద్ధిగా ఉండాలని సూచిస్తుంది. మూషకము రైతుల కష్టాన్ని దోచుకుంటుంది. అది ఒక దొంగ. కనుక రాజు దొంగలను దోపిడీగాండ్రను అణచిపెట్టి వారిపై స్వారీ చెయ్యాలి. గణేశుని చేతులలోని పాశము, అంకుశము, గదా, పుస్తకం మొదలైనవి విధాన నియమాలను, అధికారాన్ని, శాసనాలను సూచిస్తాయి. ఇట్లే, మిగతావన్నీ గణాధ్యక్ష గణపతికి (రాజుకు) ఉండవలసిన గుణగణాలను సూచిస్తాయి. ఇట్టి ప్రత్యాయనీయాలను గ్రహించటానికి బదులు ప్రతీక అయిన గణపతి విగ్రహాలకు పూజలు చేస్తే సరిపోతుందనుకోవటం ఎంతమాత్రం మంచిదికాదు.

అందరి గురించి ఇక్కడ తెలపటం కష్టం; బుద్ధిమంతులు ఆలోచించి గ్రహించగోరుచున్నాము. ముఖ్యంగా విద్యాగణపతి, ఆచార్యగణపతులను గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాము.

**విద్యాగణపతి :-** గణపతికి అసలు పెండ్లేకాలేదని కొన్ని పురాణాలు చెబుతూ ఉంటే – కొన్ని పురాణాలు బుద్ధి, సిద్ధి అనబడే ఇద్దరు భార్యలున్నట్లు చెబుతాయి. ఈ యిద్దరిని కొన్ని పురాణాలు లక్ష్మీ సరస్వతులన్నాయి. కొన్ని చోట్ల లక్ష్మీగణపతియనీ, కొన్ని చోట్ల సరస్వతీగణపతియని చెప్పారు. ఆలోచించి చూస్తే సరస్వతి విద్యకు ప్రతీక (చిహ్నము), లక్ష్మి ఐశ్వర్యానికి ప్రతీక (చిహ్నము). ఈ రెండు నిత్యాగ్నిహోత్రులకు లభిస్తాయంటుంది వేదం.

1. **'ఈజానాః స్వర్గంయని లోకమ్'** – అథర్వవేదం (18-4-2). తరచుగా

యజ్ఞాలు చేసేవారు స్వర్గలోకాన్ని పొందుతారు. (స్వర్గలోకం అంటే ఎక్కువ సుఖాలతో కూడిన జన్మ. వేరే ప్రత్యేకలోకం కాదు)

**2. 'హెూత్ర + సదనం హరితం హిరణ్యయమ్'** - అథర్వవేదం (7-99-1). నిత్యాగ్నిహెూత్రుని యిల్లు పచ్చగా పాడిపంటలతోను, హిరణ్యమయంగాను అవుతుంది.

అంటే సమృద్ధితోను, ఐశ్వర్యంతోను కళకళలాడుతుందని గ్రహించాలి. ఎక్కడ ఈ రెండూ ఉంటాయో అక్కడ సంతోషమే సంతోషం ఉంటుంది. అందుకనే అగ్నిహెూత్ర గణపతికి సంతోషమనే కుమార్తె ఉన్నట్లు ప్రచారం జరిగింది. వ్యాకరణం ప్రకారం సంతోషి పదము పుల్లింగంలో ఉంది. దానిని స్త్రీలింగంగా మార్చాలంటే సంతోషిణి అవుతుంది. కనుక సంతోషిణీ మాత అంటే సరిగా ఉంటుంది.

కొందరు విద్వాంసులు గణపతి బుద్ధికి అధిదేవతగా వ్యాఖ్యానించారు. ప్రజలలోనూ ఆ నమ్మకమే ఉంది. నేను విద్యార్థిగా ఉండే రోజులలో మా తల్లితండ్రులు తరగతి పుస్తకాలన్నిటిని వినాయకుని పాలవెల్లి క్రింద పెట్టించి పూజ చేయించేవారు. మాకు చదువుకు 1,2 రోజులు సెలవు దొరికేది. హఠయోగ ప్రదీపికను నమ్మేవారు మన శరీరంలో వెన్నెముక పొడవునా షట్చక్రాలు (ఊహా చక్రాలు) ఉంటాయని నమ్ముతారు. వారు వెన్నెముక చివర మూలాధార చక్రం ఉంటుందనీ, దానికి అధిదేవత గణపతియని అంటారు. అక్కడ మనస్సును ధారణ చేస్తే తేలికగా సుషుమ్నానాడి జాగృతమై మెదడులో ఉండే సహస్రార చక్రం వరకు ఎగబ్రాకుతుందనీ, దానితో బుద్ధి వికాసంతో బాటు వివేక జ్ఞానం కలిగి అవిద్య (అజ్ఞానం) నశించి ఆత్మసాక్షాత్కారం కలుగుతుందంటారు. అనంతరం సర్వాంతర్యామి సాక్షాత్కారం కలుగుతుందనీ, బుద్ధి ఋతంభరాప్రజ్ఞ వరకు వికసించి జ్ఞానతృప్తి, పరమానందం కలుగుతాయని యోగులు చెబుతారు.

గణపతికి లక్ష్మీ సరస్వతులు - భార్యలంటే - అగ్నిహెూత్రంవల్ల లక్ష్మి (సమృద్ధి), సరస్వతి (విద్యాబుద్ధులు) లభిస్తాయని గ్రహించాలి.

**ఆచార్య గణపతి:-** పూర్వకాలంలో విద్యాలయాలు గ్రామాలకు దూరంగా ఉపవనాలలో ఉండేవి. వాటిని గురుకులాలు అనేవారు. స్త్రీలకు వేరుగా, పురుషులకు వేరుగా దూరదూరంగా ఉండేవి. వారి భోజన వస్త్రాదులకు రాజులు, ప్రజలు తగిన ఏర్పాట్లు చేసేవారు. విద్యాభ్యాసం పూర్తయ్యేవరకు విద్యార్థులు గురుకులంలోనే ఉండాలనీ, ఇంటికి పోకూడదనీ నియమం

ఉండేది. దానికి ఒక ఆచార్యులు ఉండేవారు. ఆయన కొందరు ఉపాధ్యాయులను ఏర్పాటు చేసుకొనిగాని, లేదా తన వద్ద చదువుకున్న పెద్ద శిష్యుల సహకారంతోగాని విద్యలు నేర్పించేవారు. ముఖ్య గురువుగారినే ఆచార్యులు అనేవారు. వారికి కులపతులని మరియొక పేరు. అంటే గురుకుల పతులని (Head Master or Principal)అని అర్థం. అట్టి ఆచార్యుల కుండవలసిన గునగణాలను వింత వినాయక విగ్రహం సూచిస్తున్నదని కొందరు విద్వాంసులు వ్యాఖ్యానించారు.

ఆ ప్రకారంగా లంబోదరం గురుకులంలో వసించే పిల్లలందరిని ఆచార్యుడు తన కడుపులో పెట్టుకున్నట్లుగా వారి ఆహార వస్త్రాదులనన్నిటిని సమకూర్చాలని, భిక్షను అందరూ పంచుకు తినాలని సూచిస్తుంది. గణేశుడు మోదక ప్రియుడు. మోదకం అంటే (ముది-హర్షే) హర్షాన్ని సంతోషాన్ని కలిగించే దని అర్థం. గురువు శిష్యులతో ప్రసన్నంగా, మధురంగా వ్యవహరించాలని ఇది సూచిస్తుంది. చేతులలోని అంకుశ పాశ పుస్తకాదులు చదువుకోని విద్యార్థులపట్ల కాస్త కరుకుగానే ప్రవర్తించాలని సూచిస్తుంది. పిల్లల ప్రవృత్తి ఆటపాటల వైపే ఎక్కువగా మ్రొగ్గు చూపుతుంది. కనుక వారి బాగుకోసం పాఠాలు అప్పగించకపోతే కొద్దిగా దండించాలి. అట్లని క్రూరంగా హింసించకూడదు. చేతులో బెత్తెము ఉన్నా మనస్సులో వెన్న ఉండాలి. తల్లివంటి ప్రేమ ఉండాలి.

విద్యార్థులు చదువుతో బాటు సదాచారం నేర్చుకుని సభ్యమానవులు కావాలి. సంస్కారవంతులై ఇతరులకు ఆదర్శంగా నిలవాలి. అందుకు దండం కొంత అవసరం. లేకుంటే పిల్లలు చెడిపోతారు. కష్టాలపాలౌతారు. విద్యార్థులు మూషకంవలె గురువులందరి నుండి వీలైనన్ని ఎక్కువ విద్యలు గ్రహించి దాచుకోవాలి. అవి జీవితంలో అవసరమైనపుడు చాలా ఉపయోగపడతాయి. పొలంలోని ఎలుకలు రైతు కష్టాన్ని దొంగిలిస్తాయి. అయితే విద్యాధనం భౌతిక ధనం వంటిదికాదు.

గురువుల నుండి శిష్యులు ఎన్ని విద్యలు సంగ్రహించినా వారి విద్య తరిగిపోదు. మీదుమిక్కిలి మరింత వృద్ధిచెందుతుంది. వాహనం అంటే ప్రయాణ సాధనం. గురువుగారు మూషక వాహనుడంటే వారి విద్యలు శిష్యుల ద్వారా లోకంలో దూరదూర ప్రాంతాలకు విస్తరిస్తాయి.

# ప్రసిద్ధ వ్యక్తుల దృష్టిలో గణపతి

భారతీయ సంత్ పురుషులుగా ప్రసిద్ధికెక్కిన సంత్ జ్ఞానేశ్వర్ గారు గణపతి ఓంకారానికి సంకేతమని భావించారు. అ+ఉ+మ కలిసి ఓంకార మౌతుంది. ఈ మూడు అక్షరాలు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను సూచిస్తాయి. సృష్టి స్థితిప్రలయకర్తలైన ముగ్గురు దేవతల సంయుక్త రూపమే గణపతి అని తమ జ్ఞానేశ్వరి భగవద్గీత వ్యాఖ్య ప్రారంభంలో అభిప్రాయ పడ్డారు. అక్కడ ఆ దృష్టితోనే గణపతిని గురించి చక్కగా వర్ణించారు. గణేశుని విరిగిన దంతము ఆస్తికవాదం ఎదుట స్వయంగా ఖండితమైన బౌద్ధమతాన్ని సూచిస్తున్నదన్నారు. దీనివల్ల గజానన గణేశుని కల్పన బౌద్ధమత ప్రచారానికి ముందు లేదనే అభిప్రాయం కలుగుతోంది. వారు చెప్పిన మరొక విషయం ఏమంటే -

"హేళబ్ద బ్రహ్మ అశేష, తెచ్చి మూర్తి సురేఖ" అంటూ మొదలు పెట్టి 6 దోహాలుగా వ్రాశారు. వాటి సారాంశమేమంటే - గణేశుని ప్రతిమ శబ్ద బ్రహ్మవేదం యొక్క ప్రతీక. గణేశుని వివిధ అవయవాలు స్మృతి గ్రంథాలు. అతని 6 భుజాలు 6 దర్శనాలు. అతని చేతిలోని పరశువు తర్కశాస్త్రాన్ని సూచిస్తుంది. అంకుశం నీతిశాస్త్రం, మోదకం వేదాంతం, ఖండితమైన దంతం బౌద్ధమతం. రెండు చెవులు మీమాంసా శాస్త్రాలు పూర్వ మీమాంస, ఉత్తరమీమాంస - అంటే వేదాంత దర్శనం. అతని చెవులవద్ద తిరిగే భ్రమరాలు విద్యుత్ గణములు. అవి ఆయన చెవులవద్ద శాస్త్రాల అధ్యయనం చేస్తున్నాయి. ఆనంద మధుపానం చేస్తున్నాయి." అని అన్నారు.

సంత్ తుకారాం గారు కూడా గణపతి విగ్రహం ఓంకారానికి ప్రతీకగా ఉందన్నారు. ప్రొఫెసర్ మోనియర్ విలియమ్స్ గణేశుడు శూద్రుల దేవతయని భ్రమపడ్డారు. ప్రొ. అలింసగేటిగారు గణపతి ద్రవిడుల దేవతయన్నారు. గణేశుడు ముందుగా ద్రవిడుల దేవతగానే ఉన్నాడు, తరువాత ఆర్యులు కూడా అతనిని స్వీకరించారని డా॥ సంపూర్ణానంద స్వామిగారు అన్నారు. అష్టాదశపురాణాల్లో రకారకాలుగా గణపతిని గురించి వ్రాయటం వల్లనే పై వ్యక్తులకు అన్ని రకాలుగా అభిప్రాయాలు కలిగాయి. చరిత్రలోను గణపతి నామముగల వ్యక్తులు కొందరున్నారు. ముఖ్యంగా మహాభారతం వ్రాసిన గణపతి గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాము.

# మహాభారతం వ్రాసిన గణపతి

పూర్వం వేదంలో చెప్పబడిన భగవంతుని నామములతో తమ పిల్లలకు నామకరణం చేసుకునేవారు. ఆ నామములలో గణపతి నామం ఒకటి. కనుక గణపతి పేరుగల ఎందరో వ్యక్తులు చరిత్రలో ఉండి ఉంటారు. ఇప్పుడును కొందరున్నారు. భవిష్యత్తులోను కొందరుంటారు. అందుచేత చరిత్రలో కనబడే గణపతులు మనం నేడు చూసే గణపతి విగ్రహంలాటివారు కారు. అందరూ మహాదేవుని లేదా పార్వతి సంతానం కాదు. చరిత్ర పరిశోధకుల వివరణ ఏమంటే-

వేదవ్యాస మహర్షికాలంలో మాలతీనది ఒడ్డున 'మహాదేవుడు' అని పేరుగల ఒక గొప్ప యోగిపుంగవుడు ఉండేవాడు. అతడు పూర్ణవిద్వాంసుడు. అతడు పర్వతరాజు అను పేరుగల ఒక రాజు యొక్క కుమార్తెయైన పార్వతిని వివాహ మాడాడు. పార్వతి కూడా విదుషీమణియే. యోగినియే. వారి సంతానమే మహా భారతకాలంనాటి గణపతి. అట్టి ఉత్తములకు పుట్టిన సంతానం కావటంవల్ల గణపతి విద్వాంసుడు మరియు యోగి అయ్యాడు. ఆ గణపతి "గణేశగీత" అనే పేరుతో రాజయోగానికి చెందిన ఒక పుస్తకం వ్రాశారనీ, అది ఇప్పుడు కూడా లభిస్తున్నదనీ కొందరు పరిశోధకులంటున్నారు. ఇతడు శీఘ్రలేఖకుడు కూడానట. ఎవరైనా చెబుతూ ఉంటే దానిని వేగంగాను, పొరబాట్లు లేకుండగాను వ్రాయగల సమర్థుడట. అందుచే వ్యాసులవారు మహాభారతం వ్రాయటానికి వీరిని ఎన్నుకొన్నారు.

వీరికన్న పూర్వం కూడా ఎందరో గణపతినామం గలవారు ఉండి ఉంటారు. రామాయణ కాలంలో ఇప్పటి కేదార్‌నాథ్ క్షేత్రంలో 'శివుడు' అనే పేరుగల గొప్ప విద్వాంసుడు, యోగి, అస్త్రశస్త్ర విద్యలు నేర్చిన ఒక గొప్ప వ్యక్తి ఉండెనట. అతని కుమారుడును గణపతియే నంటారు. మన ఇతిహాస గ్రంథాలలో ఎన్నో ప్రక్షిప్త కథలు చేరాయి. కొన్ని పరస్పర విరుద్ధంగా ఉన్నాయి. ఈ కలగలపు కథలలో ఏది ఎంతవరకు సత్యమో తెలియటం లేదు. ఏది ఏమైనప్పటికి మానవశరీరం ఏనుగుతల గలిగిన గణపతి ఎవరూ ఉండరు. ఇది అసంభవ విషయం. అందుచే దీనిని ఒక ప్రతీకగా-సంకేతంగా తీసుకొని ప్రేరణ పొందటమే ఉత్తమం. అంతేకాని, ప్రతీకలకు -గుర్తులకు షోడశోపచార పూజలు చేస్తూ కాలాన్ని, ధనాన్ని వ్యర్థం చేసుకోవటం మంచిది కాదు. మీరేమంటారు?

# ముగింపు మాటలు (Conclusion)

**ప్రియపాఠకులారా!**

గణపతిని గురించి మరికొన్ని విషయాలున్నాయి. కాని, గ్రంథ విస్తరణ భీతిచే ముగింపు వైపుకు పయనిస్తున్నాము. ప్రారంభ పుటలలో తెలిపినట్లుగా మనం వేదధర్మాలను అనుసరించే వైదికులము. కేవలం నాలుగు వేదాలు మాత్రమే ఈశ్వరీయాలు. మిగిలిన అంగ ఉపాంగ బ్రాహ్మణ ఆరణ్యక ఉపనిషదాదులన్నీ ఋషులు వ్రాసినవి. వేదపదములన్నీ యౌగికాలు. ఆ పదములకు మూలమైన ధాతువులలో (Roots లో) ఉండే అర్థాలే ఆ పదములకు సరియైన అర్థాలు. వాటిని ఆ యా ప్రకరణాలను (సందర్భాలను) బట్టి 4,5 రకాలుగా అర్థాలు చెప్పుకోవచ్చు. కాని, ఆధ్యాత్మిక ఆదిభౌతిక ఆధిదైవికములనే మూడు రకాల అర్థాలే ముఖ్యమైనవి. ఆధియాజ్ఞిక, ఆధిజ్యోతిషపరమైన అర్థాలు కూడా చెప్పవచ్చునని కొందరంటారు. ఈ రెండింటినీ ఆధిదైవికార్థంలో కలిపివేయవచ్చు.

ఆధ్యాత్మికార్థంలో గణపతి అంటే జీవ గణాలకు, ప్రాకృతిక గణాలకు అధిపతియైన పరమేశ్వరుడని అర్థం చెప్పుకోవాలి. ఆ ప్రయత్నంగా ఋగ్వేద, యజుర్వేద మంత్రాలు రెండింటి అర్థం చెప్పటం జరిగింది. మరికొన్ని మంత్రాలు ప్రార్థనలుగా అట్టపైన వ్రాశాము. అట్టి సర్వవ్యాపక గణపతికి మనం ప్రతీక = ఆకారం, చిహ్నం కల్పించలేము. ఒకవేళ కల్పించాలనుకుంటే ఋగ్వేద హిరణ్యగర్భ సూక్తం (ఋ. 10-12)లో......ఉన్నట్లుగా లేదా యజుర్వేద 31వ. అధ్యాయం పురుష సూక్తం లో.... ఉన్నట్లుగా కల్పన చెయ్యాలి. వాటిని ప్రతీకలుగా - విగ్రహాలుగా చెయ్యలేము. సర్వవ్యాపక సచ్చిదానందునికి ఏ ఆకారాన్ని కల్పించగలము? షోడశోపచారపూజ లెట్లు చేయగలము? ఎవరైనా ఆ ప్రయత్నం చెయ్యదలిస్తే ముందుగా ఆదిశంకరాచార్యులవారు "పరాపూజ" పుస్తకంలో ప్రశ్నించిన ప్రశ్నలకు సమాధానం చెప్పవలసి ఉంటుంది. వారేమని ప్రశ్నించారంటే-

"శ్లో॥ **పూర్ణస్యావాహనం కుత్ర, సర్వాధారస్య చాసనమ్ ।**
**స్వచ్ఛస్య పాద మర్ఘ్యం చ, శుద్ధ స్యాచమనం కుతః ॥**

సర్వవ్యాపక పరబ్రహ్మ లేని దెచట? అతనిని ఆవాహం చేయటమెలా? ఆవాహయామి, స్థాపయామి, పూజయామి అంటూ చేసే షోడశోపచార పూజ ఎట్లా సాధ్యం ? సర్వాధారునికి ఆసనమెలా సాధ్యం? సదా పరిశుద్ధుడైన పరమాత్మకు స్నానం, అర్ఘ్యపాద్య ఆచమనాదు లెందుకు?" అంటూ 10, 15 శ్లోకాలలో ప్రశ్నించారు. కనుక లోకంలో మనం చూసే గణపతి విగ్రహం పరమాత్మకు ప్రతీక కాజాలదు.

ఇక రెండవది ఆధిభౌతికార్థం. ఆ ప్రకారం గణపతిపదము రాజునకు, గురుకులాచార్యునికి వర్తిస్తుంది. వారికి ప్రతీకగా గణపతి విగ్రహాన్ని వర్తింపచేయవచ్చు. వాటిని సంక్షిప్తంగా ఈ పుస్తకంలో చర్చించటం జరిగింది.

మూడవది ఆధిదైవికార్థం. ఆ ప్రకారం అగ్నిహోత్రమే గణపతి అవుతుంది. అది ప్రాణిగణములను, ప్రకృతి గణములను కూడా తన సీమిత శక్తితో పాలిస్తుంది పోషిస్తుంది. ఎంత ఎక్కువగా దానిలో ఆహుతులు వేస్తే అంత ఎక్కువగా ప్రాణులకు

మేలు చేస్తుంది. విగ్రహ గణపతిని గురించిన విశేషణాలలో ఎక్కువ భాగం అగ్నిహోత్రానికే వర్తిస్తున్నది. ఆ విషయాలు వివరంగా ఈ పుస్తకంలో చదివారు కదా !

బహుశః మన దేశంలో బౌద్ధ జైన మతాల ప్రభావంతో ప్రజలు అగ్ని హోత్రానికి దూరమై దాని స్థానంలో అగ్నిహోత్రానికి ప్రతీకయైన విగ్రహగణపతి పూజ చేయటానికి అలవాటుపడి ఉంటారు. అందుకనే ప్రతీ శుభకార్యానికి ముందు విగ్రహగణపతి పూజ చేయించటానికి అలవాటుపడి ఉంటారు. సృష్ట్యాదినుండి మహాభారతకాలం వరకు శు భకార్యాలన్నీ అగ్నిహోత్ర పూర్వకంగానే జరిగేవి.

దానికి బదులు నేడు విగ్రహగణపతి పూజ చేయించి వివాహాది శుభకార్యాలు జరుపుకుంటున్నారు. చివరికి శివపార్వతుల కల్యాణం జరుపాలన్నా ముందు గణపతి పూజ చేయిస్తున్నారు. అగ్నిహోత్ర కార్యంవల్ల జరిగినంత కాలుష్య నివారణ గణపతి పూజవల్ల జరుగుతుందా?

# ప్రతీకలే విగ్రహాలయ్యాయి

ప్రారంభంలో ప్రతీకలు హాస్యచిత్రాలుగా లేదా ఆలోచింపచేసే కార్టూన్స్‌గా వేసి ఉంటారు. అవి క్రమంగా విగ్రహాలై ఉంటాయి. చతుర్వేదవేత్తను తెలుపటానికి బ్రహ్మ చిత్రం, రాజుల కర్తవ్యాలను. ధర్మాలను తెలుపటానికి విష్ణుమూర్తి చిత్రం, ప్రలయంచేసే వ్యక్తిగా రుద్రుని చిత్రం, శక్తికి చిహ్నంగా దుర్గా దేవి చిత్రం గీసినట్లే అగ్నిహోత్ర గుణాలను తెలిపే వినాయక మూర్తిని చిత్రించి ఉంటారు. వాటిని క్రమంగా శిల్పులచే విగ్రహాలుగా చెక్కించి పూజాపాఠాలు రూపొందించి షోడశోపచారపూజలకు అలవాటుపడి ఉంటారు. నెమ్మది నెమ్మదిగా పవలింపు సేవలు, సుప్రభాతాలు, స్తోత్రాలు, అష్టోత్తరశతనామాలు వ్రాసి ఉంటారు. అవన్నీ ఇప్పుడు బలపడి పోయాయి. అసలు దేవుని స్వరూప స్వభావాలు తెలియకుండా అయిపోయాయి.

ప్రతీకల పూజ ఎట్లుంటుందంటే - గోపూజ చెయ్యాలంటే గోవు చిత్రానికో విగ్రహానికో పూజ చేయటంలా తయారయ్యింది. దేశభక్తి కలిగి ఉండాలంటే జాతీయ జండాకు పూజ చేసినట్లు, కార్మిక కర్షక సంక్షేమానికి కృషి చెయ్యవలసింది పోయి కమ్యూనిస్టుల జండాను పూజించినట్లుంటుంది.

అగ్నిహోత్ర కార్యానికి దేవయజ్ఞం, దేవపూజ అనే పర్యాయ పదాలున్నాయి. దేవపూజ చెయ్యమంటే అగ్నిహోత్ర కార్యం చెయ్యాలన్నమాట. అది నేడు గణపతి పూజగా మారింది. ఏది ఏమైనప్పటికి అగ్నిహోత్రకార్యంవల్ల జరిగే వాతావరణ కాలుష్య నివారణాది లాభాలు విగ్రహగణపతి పూజవల్ల కలుగవు. కనుక జడ దేవీదేవతల పూజలకు బదులు అగ్నిహోత్రకార్యం చెయ్యటమే సర్వవిధాలా మంచిది. మీరంతా బుద్ధిమంతులే కనుక మీరు కూడా ఆలోచించండి. భౌతిక శాస్త్ర సంకేతిక రంగాలలో మన బుద్ధి విమానంలా దూసుకుపోతున్నది కాని ధార్మిక విషయాలలో, కార్యాలలో అది జరగటం లేదు. ఇప్పటినుండైనా దేవుడు మన కిచ్చిన బుద్ధిని ఆ విషయాలలో ప్రయోగిద్దాము రండు.

**"సబ్ కా మాలిక్ ఏక్ హై" - అందరికి దేవుడొక్కడే.** అని సంతులు, యోగులు, మహాత్ములు, జ్ఞానులు ఎందరో ఉపదేశించారు. ఇతర మతాలవారు ఒక దేవుడినే నమ్ముతారు. కాని హిందువుల విషయంలో ఏకేశ్వరవాదం

ప్రభావం చూపటం లేదు. అనేక దేవీ దేవతల ఆలయాలు, ఒక గుడిలోనే 3,4 రకాల దేవతామూర్తులు, + నవగ్రహాలు, నందులు, క్షేత్రపాలకులు. ఒక దేవునికి లడ్డూయిష్టం, మరొకరికి హల్వా(సీరా) యిష్టం. ఇలాగే బెల్లం, పానకం, పులిహోర, దద్ధోజనం, చక్కర పొంగలి మొదలగునవి ఎన్నెన్నో ప్రసాదాలు. మన విగ్రహ గణపతికి ఉండ్రాళ్ళు యిష్టం. కొన్ని దేవతలకు తమలపాకులు ఇష్టం. పశుబలిని కోరే దేవతలు కూడా ఉన్నారు.

ఇంతేగాక, ఆ దేవుళ్ళకు జన్మవృత్తాంతాలు, వివాహ సంతానాది వృత్తాంతాలు వ్రాశారు. ఇప్పుడు సంవత్సరానికి ఒకసారి ఆ విగ్రహాలకు కల్యాణోత్సవాలు చేస్తున్నారు. కొన్ని దేవుళ్ళకు సంవత్సరానికి 2,3 సార్లు కల్యాణాలు జరిపిస్తున్నారు. తూర్పుగోదావరి జిల్లాలో ఒక దేవునకైతే ప్రతిరోజూ కల్యాణం జరుపుతారట. ఆయనకు నిత్యకల్యాణం ఇష్టమట. పవళింపు సేవలు చేసి ఉదయం నిద్రలేపుతున్నారు. దేవుడు అజుడు, అనాది, అకాయుడు, అప్రాణుడు, అస్నావిరుడు అని, మనవలె నాడులతో బంధింపబడి ఇంద్రియ సుఖాలు అనుభవించడని వేదాలు, దర్శనాలు, ఉపనిషత్తులు ఘోషిస్తూ ఉండే ఈ కర్మకాండలేమిటి? బుద్ధిమంతులు ఆలోచించండి. భౌతిక శాస్త్రసాంకేతిక రంగాలలో ప్రయోగిస్తున్న తార్కిక బుద్ధిని ఆత్మపరమాత్మల విషయంలో కూడా ప్రయోగించమని మా విన్నపం. అస్తు.

ఓమ్ శాంతి: శాంతి: శాంతి:.

ఓం నిషు సీద గణపతే గణేషు త్వా మాహుర్ విప్రతమం కవీనామ్।
న ఋతే త్వత్ క్రియతే కిం చ నారే, మహామర్కం మఘవన్ చిత్రమర్చ ॥

- ఋగ్వేదం 10-112-9

గణములకు స్వామివైన ఓ గణపతీ! సర్వవ్యాపక సర్వేశ్వరా! నీవు మా గణముల మధ్య ఆసీనుడవు కమ్ము. కవులలో నీవు విప్రతముడవు - అత్యంత జ్ఞానివి. నీ సహకారములేక మేము కించిత్ కర్మకూడా చేయలేము. దేనినీ దగ్గర చేయలేము. దూరం చెయ్యలేము. హే మఘవన్! సర్వైశ్వర్య నిధీ! నీవు మహాన్ - చాలా గొప్పవాడవు. పూజ్యుడవు. కీర్తించ తగినవాడవు. మా స్తుతి పాఠములను మన్నించుము. మమ్ము నీ దరి చేర్చుకొమ్ము.

శుభమస్తు




# శివరాత్రి రహస్యము



**1824-1883**
స్వామి దయానంద సరస్వతి


సరళార్థ వివరణ కర్త

## సుమ్నార్థి

(డా॥ కోడూరి సుబ్బారావు)

సంపాదకులు

వాచస్పతి డా॥ మట్టి కృష్ణారెడ్డి. M.A.M.Ed.Ph.D. D.lit.,



గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

# పరమశివుని ఉపదేశం

ఓం శివే తే స్తాం ద్యావా పృథివీ అసంతాపే అభిశ్రియౌ ।
శం తే సూర్య ఆ తపతు, శం వాతో వాతు తే హృదే ।
శివా అభి క్షరస్తు త్వాపో దివ్యాః పయస్వతీః ॥

-అథర్వవేదం (8-2-14)

ఓ మానవులారా ! శివుడనైన నేనే మీ కల్యాణం కొరకే, మీ సుఖశాంతుల కొరకే ఈ సృష్టిని నిర్మించాను. ఈ ద్యావా పృథివీలోకాలు సంతాపరహితాలై సకల సంపదలను మీ కొసగునుగాక! సూర్యుడు శాంతదాయకమైన ఉష్ణప్రకాశముల నిచ్చునుగాక! గాలి మీ హృదయానికి సుఖదాయకంగా వీచునుగాక! జలము రసయుక్తమై వర్షించి ప్రవహించునుగాక!

జలవాయువులను కలుషితంచేసి కష్టాలను కొనితెచ్చుకోకండి. నిత్యాగ్నిహోత్రులై వాటిని శుద్ధపరచి సద్వినియోగం చేసుకోండి. మీకు శుభమగునుగాక!

Let the heaven and the earth causing no trouble and bringing pleasure be auspicious for you, O man! let the sun shine pleasantly and let the wind blow sweetly to your heart. Let the celestial waters possessing sweetness be auspicious for you.

# ఆరంభ వాక్కులు

## సమాధిసిద్ధిః ఈశ్వర ప్రణిధానాత్

పరమేశ్వర ప్రణిధానంతో సమాధిసిద్ధి-పరమేశ్వర సాక్షాత్కారం కలుగుతుందని పతంజలి మహర్షి తమ యోగదర్శన సాధనపాదం 45వ సూత్రంలో పేర్కొన్నారు. ఈశ్వర ప్రణిధానం అంటే సర్వాంతర్యామియైన సృష్టికర్తపై అనన్య భక్తి-నీవు తప్ప నాకు వేరే ప్రాపంచిక సుఖాలేమీ వద్దు అనే భావన నిరంతరం ఉండాలి. అందుకు తగినట్లుగా తను చేసే సత్కర్మల ఫలాన్నంతటిని భగవంతునికి సమర్పించుకోవటం. పాపకర్మలన్నింటిని పరిత్యజించటం. ఆప్తపురుషుడైన శ్రీ కృష్ణభగవానుడు భగవద్గీత భక్తి యోగంలో తెలిపిన విధంగా జీవించటం. కాని, నేడు ఈ భక్తి వెర్రి తలలు వేస్తున్నది. దేవీదేవతల విగ్రహాలకు షోడశోపచారాలు చెయ్యటమే భక్తి అనే భావన బహుళ ప్రాచుర్యాన్ని పొందింది. ఇది ఎంతమాత్రం సత్యం కాదు.

పరమేశ్వర సాక్షాత్కారం పొంది సర్వదుఃఖ నివృత్తిరూప మోక్షానందం పొందటానికి పతంజలి మహర్షి చెప్పిన యోగమార్గమే సరియైన మార్గం. అందుకు సహకరించే విధంగా పరోపకారాది సత్కర్మలు చేస్తూ జీవించటమే సరియైన జీవితం. **"పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం"** అన్న వ్యాసమహర్షి వాక్కులే పాపపుణ్యాలకు సరియైన నిర్వచనం. మహర్షులు తెలిపిన శ్రవణ మనన నిధిధ్యాసనము చేయకనే మోక్ష ప్రాప్తి కలుగదు. ఈ విషయాలే ఈ లఘు గ్రంథంలో సంక్షిప్తంగా తెలుప ప్రయత్నించాను. వివరంగా తెలుసుకో గోరేవారు మహర్షి దయానందులవారి 'సత్యార్థ ప్రకాశం' చదువగోరుచున్నాను.

ఈ **'శివరాత్రి రహస్యం'** శుక్ల నామ సంవత్సరం (2000 సం॥) శివరాత్రి నాడే మా గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ద్వారా ప్రచురించటం జరిగింది. దానిని ఇప్పుడు మా సీతాఫలమండి ఆర్యసమాజంవారు ముద్రించి ఉచిత వితరణ చేయుటకు అనుమతి కోరినారు. నేను సంతోషంగా అనుమతించి, వ్యవహారభాషలోకి పరివర్తన చేసి ఇస్తున్నాను. వితరణ కర్తలకు నా హృదయపూర్వక శుభకాంక్షలు తెలుపుచున్నాను.

**- సుమ్నార్థి**
(డా. కోడూరి సుబ్బారావు)

# శివరాత్రి రహస్యం

మాఘ బహుళ త్రయోదశి శివరాత్రి పర్వదినం. ఆ రోజు శివుని అనుగ్రహానికై హిందువులని వ్యవహరింపబడే భారతీయార్యు లెల్లరు భక్తి శ్రద్ధలతో శివుని సేవించ యత్నిస్తారు. వేకువ జామున మేల్కొని కాలకృత్య స్నానాదులొనర్చి శివాలయమున కేగి వారి శక్తి కొలది పాలతోనో లేదా నీటితోనో అభిషేకాదుల నొనర్చి, యొనరింపజేసి దినమంతయు ఉపవసింతురు. రాత్రి కొన్ని ఫలాలను మాత్రం భుజించి జాగరణ చేయ ప్రయత్నిస్తారు. నేడు ఈ జాగరణ చేయుటకు టి.వి.లు, సినిమాలు ఎక్కువ ఉపకరిస్తున్నవి. భక్తుల సేవ పేరుతో సినిమా యజమానులు అర్ధరాత్రి తదుపరి యొకటి రెండు భక్తి చిత్రాలు ప్రసారం చేస్తునారు. వీధి వీధినా సమాజములు, సేవా సంస్థలు వివిధ కార్యక్రమాలు వీడియోల ద్వారా కొన్ని భక్తి చిత్రాలు ప్రదర్శించుచున్నారు. ప్రభుత్వం కూడా దూరదర్శన్‌లో ఒకటి రెండు సినిమాలను చూపించి ఇతోధిక సేవ చేస్తున్నది. మరి యొక్క వర్గం ఏదో రకంగా నిదుర మేల్కొనిన చాలునని పేకాటలో, క్లబ్బులలో, రాత్రంతయు గడుపుచున్నది. భజనలతో, నామ సంకీర్తనాదులతో జాగరణ చేయు వర్గం మాత్రం నామమాత్రమేనని చెప్పవచ్చును.

మరి శివుడెవరు? ఎక్కడుంటాడు? ఏమి చేస్తుంటాడు. అతనిని పొందే మార్గమేది? ఈ ప్రపంచ మేమి? మన మెవరం? ఎక్కడ నుండి వచ్చాము? మరణించిన పిదప ఏమగుదుము? అని ఆలోచించువారు గలరా? యని సందేహం కలుగుచున్నది. మరి వివేకవంతులైనవారు ఈ విషయాలు ఆలోచించవలదా? విద్వాంసులు, సాధువులు, సన్న్యాసులు ప్రజలకు ఈ విషయాలను బోధించవలదా? లోకంలో జిజ్ఞాసులు, వివేకవంతులు లేకపోలేదని మా నమ్మకం. అట్టి వారల కొరకు మా ఇతోధిక సేవగా ఈ చిన్న పుస్తకాన్ని ప్రచురించు చున్నాము. ఏ కొద్ది మందైనను శివరహస్యం తెలుసుకొనగలిగినచో మా ఈ కృషి సఫలమైనదని సంతోషింతుము.

## అథ శివ జిజ్ఞాసా

"శివు కల్యాణే" అను ధాతువుతో శివ పదము తయారగును. కల్యాణ స్వరూపుడు, కల్యాణకారి యగుటచే పరమేశ్వరునకు శివుడని పేరు.

కల్యాణకారుడనగా మేలు చేయువాడని అర్థం. పరమేశ్వరుడు సదా జీవులందరికి మేలు చేయుచుండును. జీవుల మేలు కొరకు సూక్ష్మ రూపంలో విడివిడి పరమాణువులుగా నున్న ప్రకృతిని పరమేశ్వరుడు తన అనంత జ్ఞాన సామర్థ్యాలతో అత్యంత రమణీయంగా విజ్ఞానయుక్తంగా మలచి ఈ సృష్టిని గావించాడు. బహు ప్రజ్ఞతో ప్రాణుల శరీరాలను నిర్మించి జీవులు భోగించుటకై ఇంద్రియాలను, మనస్సును నిర్మించాడు. అందు ఉత్తమ ప్రాణిగా మానవ శరీరాన్ని నిర్మించాడు. వికసించిన ఇంద్రియాలతో, వికసించిన బుద్ధితో నిర్మింపబడిన మన ఈ శరీరాలు పరమేశ్వరుని రచనయే. తన అద్భుత సృష్టివలన మానవులు మరింత ప్రయోజనం పొందాలని సృష్టి రహస్యాల నన్నింటిని వేదం ద్వారా ఉపదేశించాడు. అలసిన శరీర మనస్సులను నిద్రపుచ్చి నవచైతన్యాన్ని ప్రసాదించుచున్నాడు. అనన్య భక్తితో సేవించువారికి దివ్యానందము నిస్తున్నాడు. తీవ్ర వైరాగ్యం పొందినవారిని త్రివిధ శరీర బంధనాల నుండి, జనన మరణాల నుండి విముక్తుల జేసి కోటాను కోట్ల సంవత్సరాలు తన తృతీయధామంలో ఆనంద డోళికల నోలలాడిస్తున్నాడు. కనుక సర్వవ్యాపకుడైన ఆ పరమేశ్వరునకే శివుడను సార్థక నామధేయం కలిగింది.

ఆ శివునకు ఈశుడు, ఈశ్వరుడు, పరమేశ్వరుడు, శంకరుడు, మహాదేవుడు, రుద్రుడు మొదలగు పేర్లు కూడా ఉన్నాయి. ఈ నామము లన్నీ అతని గుణకర్మములు తెలుపునట్టివే.

పరమేశ్వరుడు తన అద్భుత సామర్థ్యంతో పరమాణువులలో అణుబంధనాన్ని [Chemical Bond] ఏర్పరచి వివిధ పదార్థాలను సృజించాడు. కొన్ని ప్రకృతి సూత్రాల[Physical Laws]తో గ్రహగోళాలను బంధించి వాటిని నియమబద్ధంగా నడుపుచు అందు వసించు ప్రాణుల జీవన యాత్రలను పరిరక్షిస్తున్నాడు. కనుక పరమేశ్వరునకు ఈశుడు (ఈశ-నియమనే) నియామకుడు అను పేరు కలిగినది. మనము కష్టించి సంపాదించి నిర్మించిన వస్తువులు మన ఐశ్వర్యమౌతాయి. అట్లే పరమేశ్వర నిర్మితమైన ఈ బ్రహ్మాండం, అందలి సమస్త పదార్థాలు అతని ఐశ్వర్యమే అవుతాయి. అందుచే భగవంతునకు ఈశ్వరుడు (ఇది-ఐశ్వర్యే) **ఐశ్వర్యవంతుడని** పేరు. అతని ఐశ్వర్యం శ్రేష్ఠమైనదియు, గొప్పదియు నగుటచే **పరమేశ్వరుడని** మరియొక పేరు. జీవులందరకు శం-సుఖమును కలుగజేయువాడు గనుక ఈశ్వరునకు

**శంకరు**డని పేరు. దివ్యగుణాలు గలిగిన జడ, చేతన దేవతలలో గొప్పవాడుగా ప్రకాశించును గనుక పరమేశ్వరునకు **మహాదేవు**డని పేరు కలిగింది. పాప కార్యము లొనర్చుపుడు ఆ శివుడు జీవుల అంతర్యామియై జీవులు భయాందోనళలను కలిగించి దుఃఖముల పాలుగాకుండా హెచ్చరిస్తున్నా, ఆ అంతర్యామి ప్రేరణను లెక్కచేయక పాపము లొనర్చినచో తల్లివలె బాగుపడవలెనను దృష్టితో దండించి (కష్టముల నిచ్చి) మంచి మార్గాన నడుపుటకు యత్నించుచున్నాడు. ఇంకను వినకున్న రుద్రుడై శిక్షించి సంస్కరిస్తున్నాడు. అందుచేతనే పరమేశ్వరునకు **రుద్రు**డని మరి యొక పేరు కలిగింది.

ఇవన్నీ శివ నామములే. అతడనంత సామర్థ్యయుక్తుడగుటచే అతని పేర్లను అనంతములుగానే ఉంటాయి. అందు ముఖ్యమైన 108కి పైగా పేర్లను వేదము పేర్కొంటుంది. పొరబడకుండుటకు అవి యన్నియు ఈ విధంగానే ఏకేశ్వరుడైన పరమేశ్వరునివే యని వేదం స్పష్టంగా వివరిస్తున్నది.

**ఓం ఇన్ద్రం మిత్రం వరుణమగ్ని మాహురథో**
**దివ్యః స సుపర్ణో గరుత్మాన్ ।**
**ఏకం సద్విప్రా బహుధా వదన్త్యగ్నిం**
**యమం మాతరిశ్వాన మాహుః॥** ఋగ్వేదం. 1.164.49

ఇంద్రుడు, మిత్రుడు, వరుణుడు, అగ్ని, దివ్యుడు, సుపర్ణుడు, గరుత్మంతుడు మొదలగు పేర్లన్నీ సత్స్వరూపుడైన పరమాత్మునివే. సత్స్వరూప పరమేశ్వరుడు ఒక్కడే. అతనినే విప్రులు-విద్వాంసులు బహుధా-అనేక నామములతో అగ్ని, యముడు, మాతరిష్వుడు మొదలగు పేర్లతో పిలుస్తున్నారు.

భగవంతుని ఈ నామము లన్నీ యౌగికములే-అనగా మూల ధాత్వర్థమునే ప్రకటిస్తాయి. అతనికే **బ్రహ్మ, విష్ణువు, గణపతి** మొదలగు పేర్లు కూడా గలవు. **బ్రహ్మ** యనగా అన్నిటికన్న గొప్పవాడు. **విష్ణు** వనగా (విశ్ళృ-వ్యాప్తౌ) అంతట వ్యాపించి యుండువాడు. **గణపతి** యనగా (గణ-సంఖ్యానే) లెక్కించ వీలైన జీవ గణములకు అధిపతి. కాని నేడు పురాణాల ప్రభావం వల్ల తదనుగుణంగా వ్రాసిన కవిత్వాలు, పాటలు, నాటికలు, కథలు మొదలగువాని వల్ల వాటికి రూప మిచ్చుటకు రవివర్మాదులు

వేసిన చిత్ర పటాల వల్ల, నిర్మించిన దేవాలయాల వల్ల, ఆ పంథాలోనే నడచుచున్న నాటకాలు, సినిమాల వల్ల పరమేశ్వరుని ఒక్కొక్క నామమునకు ఒక్కొక్క రూపం మన మనస్సులో స్ఫురించుచున్నది.

ఆ రూపము వెనుక ఒక చరిత్ర కదలాడును. ఆ దేవునకు భార్యా పిల్లలు, సుఖ దుఃఖాలు, ధర్మాధర్మాలు అంటగట్టబడును. అతనికి కొన్ని పదార్థాలు నైవేద్యాలలో యిష్టమైనవి యుండును. వాటితో ఆ దేవుని తృప్తి పరచ ప్రయత్నింతురు. వారిని సేవించుటకు వేర్వేరు వ్రత నియమాలుండును. కొందరు దేవతలు చాలా తేలికగా ప్రసన్నమగుదురు. అటువంటి వారిలో శివుడొకడని ప్రసిద్ధి. అతను ఉబ్బులింగడు. దుష్టులు దుర్మార్గులైనను శివుని స్తోత్రం జేసిన అతను ప్రసన్నుడై వారు కోరిన వరములనిచ్చును. ఆ వరాలు అప్పుడప్పుడు తన ముప్పునకే కారణమగును (భస్మాసురుని కథలో వలె). అప్పుడాతడు తన రక్షణ కొరకు యితర దేవుళ్ళ నాశ్రయించును. కేవలం పులి చర్మాన్నే ఆచ్ఛాదనంగా ధరించి మంచుకొండలలో తిరుగుచుండును. పాములను మెడలో దండలుగా ధరించును. నంది (ఎద్దు) అతని వాహనము. త్రిశూల మతని ఆయుధము. ఒక భార్య (పార్వతి) అర్ధ శరీర మాక్రమించుకొనగా, మరి యొక భార్య (గంగ) తలపై ఆసీనురాలై యుండును. డమరుకమును వాయించుచు అప్పుడప్పుడు శివతాండవము చేయుచుండును. అతనికి శివరాత్రి ప్రీతికరమైన రోజు. ఆ రోజు ఉపవసించి, రాత్రి జాగరణ చేసిన అతను ఎటువంటివాడైనా అజామీళుని వంటి దొంగయైనప్పటికిని అతనికి తన కైలాసమున ఆశ్రయమిచ్చి ఆదరించి ఆనందపరచును. ఇట్టి శివుని అనుగ్రహమునకేనా మనం ఉపవాస జాగరణలు జరిపేది? లేక మరియొక శివుడెవరైనా ఉన్నారా?

పరమేశ్వరుని బొందుటకు మన ప్రాచీన ఋషులు మూడు మార్గ దర్శక సూత్రాలను చెప్పారు. అవియే శ్రవణ, మనన, నిధిధ్యాసనములు. అందు ముందుగా భగవంతుని గూర్చి శ్రవణం చేయాలి. తదుపరి ఏకాంతమున వినిన విషయాలను మననం చెయాలి. తదుపరి ఆ స్వరూపాన్ని (గుణ కర్మలను) నిధిధ్యాసనము– ధ్యానము చేయాలి. శ్రవణం చేయునపుడు నేటి ప్రచలిత పురాణ వాక్కులతో శ్రవణం చేస్తే అనేక సందేహాలు

కలుగుచుండును. ఒక పురాణంలో ఒకరకంగా, మరియొక పురాణంలో మరియొక రకంగా దేవుని వర్ణన లుండును. దేవీ పురాణము దేవియే అధిదేవత యనియు, ఆమె సంతానమే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులనియు చెప్పును. అంతేగాక, వారిని పుట్టించి తనను పెండ్లి చేసుకొమ్మని కోరెనట. తల్లిని పెండ్లి చేసికొనుట అధర్మమని వెనుకాడిన బ్రహ్మ, విష్ణువులను భస్మము చేయగా మహేశ్వరుడు ప్రమాదము నుండి తప్పించుకొనుటకు తనను పుట్టించిన ఆ దేవి రూపమున గాక ఆమె వేరొక స్త్రీ రూపము ధరించినచో వివాహమాడుదునని చెప్పెనట. అందుకు ఆమె పార్వతిగా మారి మహేశ్వరుని పెండ్లాడెనట. శివ పురాణం పార్వతీ కల్యాణము గురించి మరియొక కథ చెప్పును. విష్ణు పురాణములో విష్ణువే అధిదేవతయని, బ్రహ్మ పురాణమున బ్రహ్మయే అధిదేవత యని, గణేశ ఖండమున గణేశుడే అధిదేవత యని, బ్రహ్మవైవర్త పురాణమున శ్రీకృష్ణుడే అధిదేవత యని వర్ణనలు కనిపించును.

ఒకే పురాణంలో అచ్చటచ్చట పరస్పర భిన్నాభిప్రాయాలును కనిపించు చుండును. భాగవతంలో గజేంద్రమోక్ష ప్రకరణంలో విష్ణువు "అల వైకుంఠపురంలో నగరిలో ఆమూల సౌధంబుదాపల" ఉండునని వర్ణన కనబడును. మరియొక చోట ప్రహ్లాద కథలో "ఇందు గల డందు లేడను సందేహము వలదు, చక్రి సర్వోపగతుండు" అను వర్ణన గనబడును. ఇందు ఏది నమ్మవలెను. విష్ణువు సర్వవ్యాపకుడనియా లేక వైకుంఠవాసి యనియా?

అందుచే పరమేశ్వరుని శ్రవణ, మనన, నిధిధ్యాసనములు చేయునప్పుడు అందు మొదటిదియైన శ్రవణము వేదవాక్కులతోనే **"శ్రోతవ్యః శ్రుతి వాక్యేభ్యః"** అని ఋషులు నియమమేర్పరచారు. వేదవాక్కులతో శ్రవణం చేస్తే పైన వివరించిన పొరపాట్లు కలుగవు. అందుచే మనం వేదవాక్కులతో పరమేశ్వర స్వరూపాన్ని ముందు శ్రవణం చేయుదము రండు-

ఓం స పర్యగాచ్ఛుక్ర మకాయ మవ్రణ
మస్నావిరగ్ం శుద్ధ మపాప విద్ధం
కవి ర్మనీషీ పరిభూః స్వయంభూర్
యాథా తథ్యతోర్థాన్ వ్యదధాత్
శాశ్వతీభ్యః సమాభ్యః ॥ (యజుర్వేదం. 40.8)

ఇది ప్రసిద్ధ యజుర్వేద మంత్రము. యజుర్వేదంలోని ఈ చివరి 40వ

అధ్యాయాన్నే **"ఈశావాస్యోపనిషత్తు"** అని కూడా అంటారు. ఈ మంత్రంలో పరమేశ్వరుని స్వరూపం అతి స్పష్టంగా వివరింపబడింది కనుక ప్రతి పదమును జాగ్రత్తగా అర్థం చేసికొన ప్రయత్నించాలి.

సః = ఆ పరమేశ్వరుడు

**పరి +ఆగాత్** = విశ్వమందంతట అన్ని పదార్థాల లోపల, బయట, విశ్వమునకు వెలుపల కూడా వ్యాపించి విస్తరించి, ఉన్నాడు.

**శుక్రం** = అతడు సర్వ శక్తిమంతుడు (సృష్టి, స్థితి, ప్రళయముల మూటిని ఎవరి సహాయం లేకుండా తానొకడే చేయగల సమర్థత కలవాడు)

**అకాయం** = స్థూల, సూక్ష్మ, కారణ శరీర రహితుడు

**అవ్రణం** = వ్రణ రహితుడు, ఛేదింపబడనివాడు (లోపములు లేనివాడు)

**అస్నావిరగ్ం** = స్నాయుబంధనం లోనికి నాడుల బంధనం లోనికి (శరీర బంధనం) లోనికి ఎప్పుడును రానివాడు (అనగా అవతరించడు)

**శుద్ధం** = సదా పవిత్రుడు

**అపాపవిద్ధం** = పాపంచే అంటబడనివాడు, పాపరహితుడు.

కవిః = వేద రచయిత

**మనీషీ** = జీవుల మనస్సుల నెరగువాడు

పరిభూః = ఆద్యంతము లేని అనాది పదార్థము, దుష్టనాశకుడు.

**యాథాతథ్యతోర్థాన్** = యథాతథముగా (ఎట్టి లోపము లేకుండా) ప్రపంచ పదార్థాలను

వ్యదధాత్ = సృజించుచుండును

**శాశ్వతీభ్యః సమాభ్యః** = ఎవరి కొరకనగా-ఎల్లప్పుడు నుండు జీవుల కొరకు

పై వేదమంత్రంలో పరమేశ్వరుని స్వరూపం అతి తేలిక మాటలతో స్పష్టంగా చెప్పబడింది. సర్వవ్యాపకమైన ఒక మహత్తర శక్తియే పరమేశ్వరుడు.

అది ఆద్యంతములు లేని అనాది పదార్థం. తన అనంత సామర్థ్యంతో పరమాణువులతో ప్రపంచ పదార్థాలను నిర్మించుచుండును. కాళ్ళు చేతులు లేనిది అది నిర్మించు టెట్లు?అని సందేహము కలుగ వచ్చును. తనలోనే యున్న పరమాణువులతో జగత్తును నిర్మించుటకు కాళ్లు, చేతులు అవసర ముండవు. వస్తువులను తనకంటే బయట నిర్మించినపుడే కాళ్లు, చేతులు అవసరమగును. ఉదాహరణకు మన శరీరంలో జీవశక్తి శరీర మందంతటా వ్యాపించి యుండును. అది కణములను వృద్ధిపరచుచు శరీరమును పెంచి పెద్దజేయుచుండును. ఆ జీవశక్తికి ఆకార మేమియు నుండదు. అట్లే తల్లిగర్భంలో శిశువు నిర్మించబడును. కాని, మన శరీరం వెలుపల వస్తువులు నిర్మించవలెననిన కాళ్ళు చేతులు, పనిముట్లు అవసరమగును. కనుక పరమేశ్వరుడు నిరాకారుడు. అట్టి విచిత్ర పరమాత్మ రూపమును ఉపనిషత్తులీవిధంగా వర్ణించును-

**అపాణి పాదో జవనో గ్రహీతా**
**పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః**
**స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా**
**తమహురగ్ర్యం పురుషం మహాన్తమ్ ॥**

(శ్వేతాశ్వతర ఉపనిషత్తు 3-19)

పరమేశ్వరునకు కాళ్ళు, చేతులు లేవు. కాని తన అనంత శక్తిసామర్థ్యాల చేత ప్రపంచాన్ని నిర్మించగలడు. సర్వవ్యాపకుడగుటచే మనమెంత పరుగెత్తినను మనకన్న వేగముగా అచట చేరి యున్నట్లు కనబడును. ఆయనకు కన్నులు లేవు కాని ఉన్న దున్నట్లు చూడగలడు. ఆయనకు చెవులు లేవు కాని అందరి మాటలను వినగలడు. అతనిలో అంతఃకరణము లేదు అయినను సమస్త జగత్తును, ప్రాణులను తెలుసుకొనగలడు. జీవులు పరిమిత శక్తి గలవారగుటచే ఆయనను సంపూర్ణంగా తెలిసికొనలేరు. ఆయన సనాతనుడు (ఆది లేనివాడు, జన్మ లేనివాడు) పురుషోత్తముడు. సర్వశ్రేష్ఠుడు.

పై యజుర్వేద మంత్రంలో **"అకాయం"**, **"అవ్రణం"** అను పదములతో బాటు **"అస్నావిరగ్ం"** అను పదము కూడా కలదు. నాడీ బంధనము (శరీర బంధనము) లోనికి రానివాడని ఈ పదమున కర్థం. దీనిని బట్టి పరమేశ్వరుడు ఎట్టి పరిస్థితులలోను శరీరమును ధరించడని (అవతరించడని)

తెలియుచున్నది. అసలు అవతరించుట యను పదమే భగవంతునకు వర్తించదు. అవతరించుట అనగా పైనుండి క్రిందకు దిగుట. మానవులు తాము పైనున్నచో క్రిందకు దిగుదురు. పరమేశ్వరుడు పైన, క్రింద అంతటా నుండువాడు గనుక అవతరించుట (దిగుట) యను ప్రసక్తియే ఉండదు. మరియొక పదము **"అపాపవిద్ధమ్"** పాపము చేత అంటబడని వాడని ఈ పదమున కర్థం. అవతారవాదులు ఒక అవతారమున జేసిన (రామావతారమున చెట్టు చాటునుంచి వాలిని జంపిన) పాపమును మరి యొక అవతారమున (కృష్ణావతారము యెత్తి) ఒక బోయవానిచే చెట్టు చాటునుండి చంపబడెనని కర్మఫలం అనుభవించెనని చెప్పుదురు. ఇది వేద విరుద్ధము. ఈ వాక్యము జీవులకు వర్తిస్తుంది. కాని పరమాత్మకు కాదు. పరమేశ్వరుడు పాపము చేయనేచేయడు. అతడు పాపరహితుడు.

ఆదిశంకరాచార్యులు కూడా తమ బ్రహ్మసూత్ర భాష్యంలో **"కరుణవచ్చేన్న భోగాదిభ్యః"** (వేదాంత దర్శనము 2-2-40) అను సూత్రమునకు అర్థం వ్రాయుచు **"అథ లోక దర్శనానుసారేణేశ్వరస్యాపి కించిత్ కరుణానామాయతనం శరీరం కామేన కల్ప్యేత ఏవమపి నోపపద్యతే । స శరీరత్వే హి సతి సంసారివద్భోగాది ప్రసంగాదీశ్వరస్యాప్యనీశ్వరత్వం ప్రసజ్యేత."** అనగా-

'ఒకవేళ లోకములో వినునట్లు ఈశ్వరుడు ఇంద్రియాలతో కూడిన శరీరాన్ని ఊహించుటకును వీలులేదు. శరీరముండునేని లౌకిక మానవుల వలె భోగముల ననుభవించవలసి యుండును. భోగముల ననుభవించిన ఈశ్వరుడు ఈశ్వరుడుగాక మానవుడే యగను.' కనుక పురాణాది వర్ణిత ఈశ్వరస్వరూపం అభూతకల్పనయే యగును. దీని వెనుక ఏదో ఆధ్యాత్మికార్థ మున్నదని తలలు పగులగొట్టుకొనుటకన్న స్పష్టమైన మాటలతో జెప్పు వేదమంత్రాలతో పరమేశ్వరుని అర్థం చేసికొనుటకు ప్రయత్నించుట క్షేమకరం.ఎన్ని జన్మలు ఈ సాకారేశ్వరుని భక్తిశ్రద్ధలతో సేవించినను అసలుఈశ్వరుని తెలుసుకొనలేము.

ఆధునిక పాశ్చాత్య తత్త్వవేత్తలు, కొందరు విజ్ఞానవేత్తలు పరమేశ్వరుని గూర్చి పై వేదాభిప్రాయాన్నే కలిగియున్నారు. అందు ఒకరిద్దరి అభిప్రాయాలను ఉదహరించుచున్నాము. చార్లెస్ కోల్‌మన్ అను ప్రసిద్ధ

పాశ్చాత్య విద్వాంసుడు తన మహాత్వపూర్ణమైన శైలిలో వేదోక్త ఈశ్వరుని ఈ విధంగా ప్రతిపాదించెను.

The Almighty, Infinite, Eternal, Incomprehensible, Selfexistant Being, He who sees everything though never seen in Brahma. The one unknown True Being, the Creator, Preserver and Destroyer of the universe. Under such and innumerable other definitions is the Deity acknowledge in the Vedas. (Mythology of the Hindus by Charles coleman)

సారాంశ మేమన! వేదములందు సర్వశక్తిమంతుడు, అనంతుడు, నిత్యుడు, స్వయంభూః సర్వజ్ఞుడు, సృష్టి ఉత్పత్తి స్థితి లయ కర్తయైన ఏకేశ్వర తత్త్వం ప్రతిపాదింపబడింది. సాధారణంగా వైజ్ఞానికులను నాస్తికులని అనుకొనెదరు. కాని వైజ్ఞానికులంతా నాస్తికులుకారు. ఆధునిక విజ్ఞాన పితగా ప్రసిద్ధి చెందిన సర్ ఐజాక్ న్యూటన్ గట్టి ఆస్తికుడు. అతడు తన "ప్రిన్సిపుల్" అనే ఖగోళ శాస్త్ర గ్రంథంలో- "All this material universe is the hard work of one Omniscient and Omnipotent creator" "ఈ సమస్త భౌతిక జగత్తు సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు నైన ఒకే పరమేశ్వరుని సృష్టి" అని వ్రాసినాడు. ఇంకను ఆ పరమేశ్వరుని గుణములను వర్ణిస్తూ- "We therefore, acknowledge one God, Infinite, Eternal, Omnipresent. Omni-potent, the Creator of all things, most wise, Most just, Most Good, Most Holy"-కనుక మనమంతా అనంతుడు, నిత్యుడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు, సర్వశక్తిమంతుడు, సృష్టికర్త, సర్వోపరి న్యాయకారి, పరమ పవిత్రుడునైన ఒకే ఈశ్వరుని అస్తిత్వమును అంగీకరింపవలసి వచ్చును" అని వ్రాసిరి. ఈ భావము సరిగా మహర్షి దయానందుడు ఆర్యసమాజ నియమాలుగా ఏర్పరచిన రెండవ నియమానికి సరిపోవుచున్నది.

ప్రఖ్యాత వైజ్ఞానికుడైన ఐన్‌స్టీన్ కూడా గొప్ప ఆస్తికుడు. అతడు. "I believe in God who reveals themself in the orderly harmony of the universe. I believe that intelligences in Manifested throughout all nature. The basis of all scientific work is the conviction that the world is an ordered and comprehensive entity and not a thing of chance."

"ప్రపంచమందలి క్రమబద్ధమైన పొందికరూపమున తనను ప్రకటించు కొనుచున్న ఈశ్వరుని ఉనికిని నేను విశ్వసిస్తున్నాను. ప్రకృతియందంతట

బుద్ధికుశలత ప్రకటితముగుచున్నదని నా విశ్వాసం. ప్రపంచం క్రమబద్ధము సమగ్రమునైన ఒక వాస్తవిక తత్త్వం . అది ఆకస్మికంగా ఏర్పడిన వస్తువుకాదు అను విశ్వాసమే వైజ్ఞానిక ప్రక్రియ లన్నిటికిని మూలాధారం" అన్నారు.

నేటి వైజ్ఞానిక యుగంలో కూడా విద్యావంతులు పురాణాలనే నమ్ముచు అందలి విషయాలనే సత్యమని నమ్మటం కడువిచారకరం. శివరాత్రి పర్వదినాన ఉపవాస జాగరణలు చేయు విద్యావంతులందరి దృష్టిలో శివుడు సాకారమూర్తి. పురాణాలు ఒకరకంగా ఈశ్వరుని వర్ణించుచుండగా శివాలయంలో కేవలం లింగము మాత్రమే కనబడును. ఈ లింగము వెనుక కూడా ఒక చరిత్ర ఉందట. శివపురాణంలో శివుడు సృష్టి చేయవలెనని తలంచి నారాయణ పేరుగల ఒక వ్యక్తి జలాశయమును సృజించగా దాని నుండి ఒక కమలం ఉత్పన్నమై ఆ కమలం నుండి బ్రహ్మ పుట్టెనట. అతడంతటా జలమయమై యుండుట చూచి తన పొడిసెలతో (నోటితో) కొంత జలమును పుచ్చుకొని మరల దానిని ఆ నీటి యందే ఉమ్మివేయగా ఆ నీటిలో యొక బుగ్గ పుట్టి దాని నుండి విష్ణువు వెడలెనట. అతడు బ్రహ్మను జూచి "ఓ పుత్రకా ! నీవు సృష్టి చేయుము" అని చెప్పగా బ్రహ్మ అతనితో "నేను నీ కుమారుడను గాను, నీవే నాకు పుత్రుడ" వని యనెనట. దానితో వారిలో వివాదము పుట్టి వేయి సంవత్సరాలు నీటి పైననే యుద్ధము చేసిరట. అప్పుడు మహాదేవుడు వారిరువురి మధ్య నొక తేజోమయమైన లింగాన్ని పుట్టించెనట. ఆ లింగం క్షణంలో ఆకాశమునకు పెరిగిపోయెనట. అది జూచి ఆ ఇరువురు ఆశ్చర్యమగ్నులై యుండిరట. అప్పుడు ముందుగా నెవ్వరు ఆ లింగము యొక్క ఆద్యంతములు తెలిసికొనిరాగలరో వారు తండ్రి, మిగిలినవాడు పుత్రుడగునను నియమమేర్పరచుకొనిరట. అంత విష్ణువు తాబేలు రూపమును ధరించి జలం లోనికిని. బ్రహ్మ హంస రూపంతో ఆకాశం వైపునకును మనోవేగంతో వెళ్ళిరట. వారట్లు దివ్య సహస్ర వర్షాల పర్యంతం పోయినను వారికి దాని యంతు దొరకనందున క్రింది నుండి మీదికి విష్ణువును, మీది నుండి క్రిందికి బ్రహ్మను తమలో తాము "అతడంతమును తెలిసికొనియే వచ్చి యుండిన నేనతనికి పుత్రుడను కావలసి వచ్చునే" అని చింతించుచురాగా మీది నుండి యొక ఆవును, ఒక కేతకీ వృక్షమును క్రిందికి దిగి వచ్చుటను బ్రహ్మ జూచి మీరెచ్చట నుండి వచ్చుచున్నారని వాని నడుగ నవి బ్రహ్మతో "మే మీ లింగము ననుసరించి వేయి సంవత్సరముల నుండి వచ్చుచున్నామని చెప్పెనట. మరల

బ్రహ్మ "ఈ లింగానికి అంత మున్నదా? లేదా? యని వాని నడుగ నవి లేదని ప్రత్యుత్తర మిచ్చెనట. అంతట బ్రహ్మ వానితో నాతో గూడ వచ్చి "ఓ ఆవూ ! నీవు యీ లింగము శిరస్సు మీది క్షీరధార గురిపించుచున్నట్లుసూ, ఓ కేతకీ వృక్షమా ! నీవు పువ్వులను వర్షించుచున్నట్లుసూ సాక్ష్యమిచ్చిన మీ గమ్యస్థానమునకు చేర్చగలనని చెప్పగా "మేము తప్పుడు సాక్ష్యము యీయజాలమని" ప్రత్యుత్తర మిచ్చినవట.

అప్పుడు బ్రహ్మ కుపితుడై మీరు నేను చెప్పినట్లుగా సాక్ష్య మీయకపోయిన మిమ్ముల నిప్పుడే భస్మము గావించెదనని వానిని బెదిరింపగా నవి జడిసి మీరు చెప్పినట్లు సాక్ష్యమిస్తామని ఒప్పుకొనినవట. అప్పుడా ముప్వురును గలిసి క్రిందకు దిగివచ్చి వీరి కంటె ముందుగా నచ్చటికి చేరియున్న విష్ణువును జూచి బ్రహ్మ "నీవు వీని యంతమును తెలిసికొని వచ్చితివా? లేదా?" అని యడిగెనట. అందుకు విష్ణువు 'నాకు దీనియంతు చిక్కలేదు" అని చెప్పగా, బ్రహ్మ 'నేను తెలిసికొని వచ్చితి నని చెప్పెనట. అంత విష్ణువు దీనికి 'సాక్ష్య మెవ్వరని" బ్రహ్మ నడుగగా అంత ఆ ఆవును కేతకీ వృక్షమును 'మే మిరువురము లింగము శిరస్సుపై నుంటి" మని సాక్ష్యమిచ్చెనట. వెంటనే ఆ లింగమున ఒక శబ్ద ముత్పన్నమై వృక్షము నుద్ధేశించి 'ఓ కేతకీ వృక్షమా! నీ వసత్యము పలికితివి. కావున నీ పుష్పములకు నా మీద గాని, ఇతర దేవతల మీద గాని ఉంచే అర్హత లేకుండా పోవును గాక ! అట్లెవడైన ధరింపజేసిన వాడు నిర్మూలమగును గాక' యనియు; ఆవు నుద్దేశించి 'నీవు నీ నోట అసత్య మాడితివి కావున ఆ నోటితోనే నీ వశుద్ధము తినెదవు గాక! జనులు నీ ముఖమును పూజింపక 'నీ తోకను పూజించెదరుగాక!' యనియు పిమ్మట బ్రహ్మ నుద్దేశించి **'నీ వబద్ధమాడితివి కావున ఈ ప్రపంచము నందెచ్చటను నీ పూజ లేకపోవును గాక'** యనియును శాప మొసంగి, తదుపరి విష్ణువు నుద్దేశించి 'నీవు సత్యము పలికితివి కావున నిన్నంతటా పూజించెదరు గాక!' యనియు వరము నిచ్చెనట. అంతట బ్రహ్మ, విష్ణువు లిరువురును లింగమును స్తోత్రము చేయగా ప్రీతిజెంది ఆ లింగములో నుండి యెక జటాజూటమూర్తి బయలు వెడలి ఆ ఇరువురను జూచి మిమ్ములను నేను సృష్టి జేయ బంపితిని. మీలో మీరు కలహించుచున్నారేల? యని యడుగగా బ్రహ్మ విష్ణువులు సామగ్రి లేనిది సృష్టి నెట్లు చేయదుమని ప్రత్యుత్తర మిచ్చిరట. అప్పుడు మహాదేవుడు తన జటాభారము నుండి ఒక బూడిద ముద్దను తీసి వారి చేతికిచ్చి పొండు!

దీనితో ప్రపంచమంతటిని రచింపుడని యాజ్ఞాపించెనట. ఇట్టి కథలే పురాణాలలో అనేకములు గలవు. మరియొకచోట ఈశ్వరుని జననేంద్రియము లింగమనియు, పార్వతి యోనిభాగమే పానవట్టమనియు వ్రాసియున్నది. వామమార్గులా యుద్దేశముతోనే లింగమును పూజించుచు, వావివరుసలు లేక కామకేళి జరుపుకొందురు. ఆ మాటలన్నియు వ్రాయుటకు, వినుటకు కూడా సభ్యతగా నుండవు.

పురాణములన్నియు స్వార్థపరుల కపోల కల్పితాలు. వారి పేరున వ్రాసుకొన్న ప్రజలు నమ్మరని వ్యాస మహర్షి పేర వ్రాసిపెట్టిరి. బంకించంద్ర చటోపాధ్యాయ గారు పురాణములు వ్యాసకృతములు కావనియు, నవీనములనియు సప్రమాణంగా నిరూపించిరి. ఈ పురాణ కథల వెనుక ఏవో గూఢమైన ఆధ్యాత్మికార్థాలున్నాయని పండితులు గోల చేయుచుందురు. ఏవో అర్థములను కల్పింతురు. ఒకరు ఒక అర్థము చెప్పిన మరియొకరు వేరొక అర్థము జెప్పుదురు. ఏ రెండింటికి పొసగదు. దేవుని గూర్చి ఇంత త్రిప్పి త్రిప్పి కథలు వ్రాయనేల? వేదము చెప్పినట్లు సూటి మాటలతో చెప్పరెందుకు? ఈ తప్పుదుదారిని పట్టిన సామాన్య ప్రజలకు చక్కటి రాజమార్గ మేల చూపించరు? ఈ లింగము నారాధించువారిలో ఎందరికి శివజిజ్ఞాస కలిగినది?

ఎవరికి జిజ్ఞాస కలిగినను, కలగకున్నను ఒక వ్యక్తికి ఒక్క రాత్రిలోనే లింగము శివుడు కాదనియు, సర్వవ్యాపకమైన తత్త్వమేదో యుండి యుండవచ్చుననియు శివ జిజ్ఞాస ప్రారంభమై ప్రపంచమునకు మహోపకారము జరిగినది. ఆ వ్యక్తియే మహర్షి దయానందుడు.

మహర్షి దయానందుని బాల్య నామము మూలశంకరుడు. గుజరాత్‌లోని టంకారా యను నొక కుగ్రామములో ఔదీచ్య బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన వాడు. తల్లిదండ్రులు గట్టి శైవ సాంప్రదాయులు. చిన్ననాటి నుండియే శివపూజా విధానము, యజుర్వేద పారాయణము మొదలగునవి నేర్పించిరి. 13వ యేట తండ్రి శివరాత్రి పర్వదినమున ఉపవాస జాగరణలు జరుపమని శాసించెను. పుత్రవాత్సల్యంతో తల్లివలదన్నను తండ్రి వినలేదు. ఆ రోజు బలవంతంగా ఉపవసించి జాగరణ చేయుటకై మూలశంకరుడు తండ్రి వెంట

ఊరి బయటనున్న శివాలయమునకు వెళ్లెను. నేటి మాదిరిగా ఆనాడు సినిమాలు, టి.వి.లు లేకుండెను. ప్రజలు భక్తి శ్రద్ధలతో భజనలు గానము జేయుచు శివనామ జపము జేయుచు జాగరణ చేసెడివారు. ఆ రోజు కూడా అదే జరిగినది. అర్ధరాత్రి తదుపరి నిద్రనాపుకోలేక కొందరు ఇండ్లకు వెళ్ళియు, మరికొందరు అచటనే నిదురపోవుటయు జరిగెను. శివభక్తుడైన తండ్రి కూడా నిదురలోనికి జారుకొనెను. కాని మూలశంకరుడు తండ్రి చెప్పిన "శివరాత్రి పర్వమున ఉపవాస జాగరణలు జరిపినవారికి శివుడు ప్రత్యక్షమై వారు కోరిన వరము లిచ్చు" నను మాటను జ్ఞప్తికి తెచ్చుకొనుచు తదేకదృష్టితో లింగమునే జూచుచుండెదు. అచట నిశ్శబ్ద వాతావరణ మేర్పడగానే ఆకలితో మాడుచున్న దేవాలయములోని ఎలుకలు బయటికి వచ్చి ప్రసాదంగా పెట్టిన పండ్లను తిని, ఆకలి తీరి గంతులు వేయుట మొదలుపెట్టినవి. అవి లింగముపైకి కూడా ఎక్కి దానిపై గంతులు వేయుటయే గాక మల మూత్రములు విసర్జించినవి. తదేక దీక్షతో జూచుచున్న మూలశంకరునకు ఈ సంఘటనతో అనేక సందేహము లుత్పన్నమైనవి. ఈ లింగము పురాణ వర్ణిత ఈశ్వరుడేనా? అట్లయిన ఎలుకలు తనపై ఎక్కుచున్న అదలింపడేమి? కదలడేమి? తన త్రిశూలముతో అదలించడేమి? అని ఆలోచించుచు తండ్రిని మేల్కొలిపి అడిగెనట. దానికి తండ్రి ఈశ్వరుడు కైలాసవాసి, మనం ఈ శరీరంతో కైలాసమునకు పోయి భజించలేము కనుక ఆయన మూర్తిగా (ప్రతినిధిగా) ఈ లింగము నారాధింతుము, తద్వారా అతని పూజ సలిపినవారమై అతని అనుగ్రహమునకు పాత్రులమగుదుమని చెప్పెనట. ఆ సమాధానం మూలశంకరునకు తృప్తి కలిగించకపోవుటచే ఇంటికేగి తల్లి నడిగి భోజనము చేసి పరుండెనట. తెల్లవారిన పిమ్మట తండ్రి యింటికి వచ్చి గద్దించెనట. అప్పటి నుండి మూలశంకరునిలో శివజిజ్ఞాన అంకురించినది.

దీనితోబాటు అతని సోదరి మరణము, పినతండ్రి మరణము అతనిలో మరింత జిజ్ఞాసను పెంచినవి. మృత్యువేమిటి? మరణించిన మన మే మగుదుము? మృత్యువు లేకుండా చేసికొనలేమా? అని ఆలోచించుకొనుచు గడిపెడివాడు. ఈ జిజ్ఞాస అతి తీవ్రమై ఒకనాడు అతడు ఇల్లు వదలి దేశసంచారానికి బయలుదేరి దేశములు తిరుగుచు తిరుగుచు గురువులు, విద్వాంసులు, యోగులు ఎక్కడెక్కడ కలరని విన్నను అచ్చటచ్చటకు ఎన్ని కష్టము లెదురైనను వెళ్ళి కలుసుకొని తన జిజ్ఞాసను వ్యక్తపరచేవాడు. వారు

తాము నమ్మిన, తమకు తోచిన మార్గాలను జూపెట్టిడివారు. మూలశంకరుడు శంకరాచార్య సంప్రదాయక సన్న్యాసులనుండి సన్న్యాస దీక్ష గైకొని స్వామి దయానంద సరస్వతి అయ్యెను. దయానంద స్వామి వివిధ, సంప్రదాయ గ్రంథముల నధ్యయనము చేసెను. అందు ఏ మార్గం సరియైనదో నిర్ణయించుకొనలేకపోయెను. ఒకే మతమున ఇన్ని సంప్రదాయము లేల? ఇవి యన్నియు మార్గములేనా? లేక ఇందు యే యొక్కటియే సరియైన మార్గమా? అని తర్కించుకొనుచు చివరకు మధురానగరమున వ్యాకరణ భాస్కరునిగా ప్రసిద్ధి జెందిన విరజానంద గురువును చేరుకొనెను. అతడు పెట్టిన కఠిన నియమాలన్నియు పాటించి పాణినీ వ్యాకరణమును ఆర్షప్రణాళిక ననుసరించి అధ్యయనం చేసెను. ఆ దృష్టికోణంతో వేదాలను అధ్యయనం గావించెను. ఋషి మునుల గ్రంథాలను చదివెను. అంతటితో అతనికి జ్ఞానోదయమయ్యెను. ఈశ్వరీయ గ్రంథాలు ఋగ్యజుస్సామా థర్వణములను నాలుగు సంహితలు మాత్రమేననియు, మిగిలినవి ఋషి కృతములనియు, మరికొన్ని ఋసి మునుల పేర స్వార్థపరులు వ్రాసిన కట్టు కథలనియు తెలిసికొనెను. అందు ఈశ్వరవాణియైన వేదములే పరమ ప్రమాణములనియు, ఋషి మునులు వ్రాసిన బ్రాహ్మణ, ఆరణ్యక, ఉపనిషదాది గ్రంథములు పరతః ప్రమాణములనియు తెలిసికొనెను. వీటికి భిన్నమైన గ్రంథములను త్యజించవలెననియు, లేకున్న సత్యము బోధపడదనియు గుర్తించెను. ముక్తికామియై ఏకాంతమున కేగదలచిన దయానందుని గురుదక్షిణగా వేదోద్ధరణ చేయుమని గురువు విరజానందుడు ఆదేశించెను. తదాదేశానుసారము తాను పొందిన జ్ఞానంతో మత మతాంతరాలలోని మూఢ నమ్మకాలను, దాని వెనుక స్వార్థ గురువుల మాయాజాలాలను ఖండించి వేద మతోద్ధరణకై తన జీవితము నంకితము జేసెను. మరుగున పడిన వేదమతము నుద్ధరించి లోకమునకు మహోపకారము జేసెను.

వేదప్రమాణములతో అనేక సంఘ సంస్కరణ కార్యక్రమములను చేపట్టెను. బల్యవవాహ నిషేధము, స్త్రీ విద్యా ప్రోత్సాహము, వితంతు పునర్వివాహ వ్యవస్థ, అంటరానితన ఖండన, గుణకర్మలను బట్టి వర్ణాశ్రమ వ్యవస్థ, స్వాతంత్ర్యేచ్ఛ మొదలగునవన్నియు భారతీయులకు దయానందుడు ప్రసాదించినవియే. సంఘ సంస్కరణలన్నిటికి అతడే ఆద్యుడు. వాటిని ప్రారంభించిన మొదటి వ్యక్తి.

తన తదుపరి కూడా ఈ సంస్కరణోద్యమం కొనసాగించుటకై "ఆర్యసమాజ" మను సంస్థను స్థాపించి వేదభాష్యము, సత్యార్థప్రకాశము, సంస్కారవిధి, గోకరుణానిధి, వ్యాకరణ విషయక గ్రంథములు మొదలగు అనేక గ్రంథములు భారతీయులకు వ్రాసి యిచ్చెను. అందుచే మహర్షి దయానందుని భక్తులు ఈ శివరాత్రిని బోధ రాత్రిగా జ్ఞాన రాత్రిగా జరుపుకుందురు. దయానందుని సేవలను మరొకసారి స్మరణము జేసికొని జాతి సేవకు పునరంకితమగుదురు.

దయానందుని వలె శివరాత్రి పర్వమున శివ జిజ్ఞాసను పెంపొందించు కొని అందుకొరకై స్వాధ్యాయ సత్సంగాలను జరుపుకొని ఏకాంతమున వేదోక్త శివుని మన హృదయమున ధ్యానించి శివానందము నొందుదము రండు.

## వేదాలలో శివ సంకల్ప మంత్రాలు

**ఓం యజ్జాగ్రతో దూరముదైతి దైవం తదు సుప్తస్య తథైవైతి**
**దూరంగమం జ్యోతిషాం జ్యోతి రేకం**
**తన్మే మనః శివసంకల్పమస్తు ॥** యజు. 34.1

**తా:-** మనస్సు జాగ్రదవస్థలోను, స్వప్నావస్థలోను దూరదూరమునకు వెళ్ళుచుండును. అది దివ్యగుణముగలది. ఇంద్రియములకు జ్ఞానజ్యోతి నొసంగును. అట్టి నా మనస్సు సదా శుభసంకల్పములుగలదియగు గాక!

**ఓం యేన కర్మాణ్యపసో మనీషిణో యజ్ఞే**
**కృణ్వంతి విదథేషు ధీరాః । యదపూర్వం**
**యక్షమన్తః ప్రజానాం తన్మే మనః శివసంకల్పమస్తు ॥** యజు. 34-2

**తా:-** సత్కర్మనిష్ఠులు, బుద్ధిమంతులు, ధ్యానశీలురు యజ్ఞాది సమస్త కార్యములలో సర్వకర్మలను మనస్సుతోనే చేయుదురు. అది ఆశ్చర్యకరమైనది. ప్రాణుల హృదయములలో అనేక కోరికల కోరు చుండును. అట్టి నా మనస్సు సదా ఉత్తమకోరికలనే కోరునట్టిదియగుగాక!

**ఓం యత్ప్రజ్ఞానముత చేతో ధృతిశ్చ**
**యజ్జ్యోతిరంత రమృతం ప్రజాసు ।**
**యస్మాన్న ఋతే కించన కర్మక్రియతే**
**తన్మే మనః శివసంకల్ప మస్తు ॥** యజు. 34.3

తా:- మనస్సు జ్ఞానమునొసంగును, స్మరణాదులకలిగించును. ధీరత్వమును చేకూర్చును, మానవుల అంతరంగమున అది నాశరహితమైన జ్ఞానజ్యోతి. అది లేనిచో మానవు లే కార్యమును చేయజాలరు. అట్టి నా మనస్సు సదా శుభసంకల్పములు కలదియగు గాక !

ఓం **యేనేదం భూతం భువనం భవిష్యత్పరిగృహీత**
**మమృతేన సర్వమ్ । యేన యజ్ఞ స్తాయతే**
**సప్తహోతా తన్మే మనః శివసంకల్పమస్తు ॥** యజు. 34.4

తా:- అమృతస్వరూపమైన మనస్సు భూత భవిష్యత్ వర్తమాన కాలములలోని సర్వవిషయములను తెలిసికొనుచున్నది. సప్తహోతలచే నిర్వహింపబడు అగ్నిష్టోమాది యజ్ఞములనన్నింటిని మనస్సు చేతనే నిర్వహింతుము. అట్టి నా మనస్సు నాకు సదా శుభమైన కోరికలనే కలిగించుగాక !

ఓం **యస్మిన్నృచః సామ యజూగ్ంషి యస్మిన్**
**ప్రతిష్ఠితా రథనాభావివారాః। యస్మిం శ్చిత్తగ్ం**
**సర్వమోతం ప్రజానాం తన్మే మనః శివసంకల్పమస్తు ॥** యజు. 34.5

తా:- శుద్ధమగు మనస్సులో ఋగ్ యజుస్సామాథర్వవేదములు రథచక్రము యొక్క నాభిలో అరలవలెను ప్రతిష్ఠితములై యున్నవి. మానవుల సమస్తజ్ఞానము మనస్సులోనే కలదు. అట్టి నా మనస్సు సదా శుభసంకల్పములు గలదియగుగాక!

ఓం **సుషారథి రశ్వానివ యన్మనుష్యాన్నేనీయ**
**తేఽ భీషుభి ర్వాజిన ఇవ ।**
**హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠం**
**తన్మే మనః శివసంకల్పమస్తు ॥** యజు. 34.6

తా:- ఉత్తమసారథి పగ్గములతో పట్టుకొని వేగవంతములగు గుఱ్ఱములను తన వశమునందుంచుకొని రథమును నడుపునటుల, మనస్సు కూడా మానవులను నియమములో నుంచి సన్మార్గమున ప్రవర్తింపజేయును. అది హృదయములో స్థిరముగా నుండును. జరాదులు లేనిదై శీఘ్రగతి గలదై యుండును. అట్టి నా మనస్సు సదా నాలో ఉత్తమ కోరికలనే కలిగించుగాక!

# నమకమ్

## యజుర్వేదము 16వ అధ్యాయము

నమస్తే రుద్ర మన్యవ ఉతో త ఇషవే నమః ।
బాహుభ్యాముత తే నమః॥ 1

యాతే రుద్ర శివా తనూరఘోరాఽపాపకాశినీ ।
తయా నస్తన్వాశన్తమయా గిరిశన్తాభి చాకశీహి॥ 2

యామిషుం గిరిశన్త హస్తే బిభర్ష్యస్తవే ।
శివాం గిరిత్ర తాం కురు మా హింసీః పురుషం జగత్ ॥ 3

శివేన వచసా త్వా గిరిశాచ్ఛా వదామసి ।
యథా నః సర్వమిజ్జగదయక్ష్మం సుమనా అసత్ ॥ 4

అధ్యవోచ దధివక్తా ప్రథమో దైవ్యో భిషక్ ।
అహీంశ్చ సర్వాఞ్జమ్భయన్త్సర్వాశ్చ
యాతుధాన్యోఽధరాచీః పరా సువ ॥ 5

అసౌ యస్తామ్రోః అరుణ ఉత బభ్రుః సుమఙ్గలః
యేచైనం రుద్రా అభితో దిక్షు శ్రితాః సహస్రశోఽచైషాం
హేడఽఈమహే॥ 6

అసౌ యోఽవసర్పతి నీలగ్రీవో విలోహితః ।
ఉతైనం గోపా అదృశ్రన్నదృశ్రన్నుదహార్యః
స దృష్టో మృడయాతి నః॥ 7

నమోఽస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే ।
అథో యే అస్య సత్వానోఽహం తేభ్యోఽకరం నమః ॥ 8

ప్రముఞ్చ ధన్వనస్త్వముభయో రార్త్న్యోర్జ్యామ్ ।
యాశ్చ తే హస్త ఇషవః పరా తా భగవో వప ॥ 9

విజ్యం ధనుః కపర్దినో విశల్యో బాణవాం ఉత ।
అనేశన్నస్య యా ఇషవ అభురస్య నిషఙ్ గధిః ॥ 10

యా తే హేతిర్మీఢుష్టమ హస్తే బభూవ తే ధనుః ।
తయాఽ_స్మాన్విశ్వత స్త్వమయక్ష్మయా పరి భుజ॥
పరి తే ధన్వనో హేతిరస్మాన్ వృణక్తు విశ్వతః 11
అథో యఽ_ఇషుధిస్తవారే అస్మన్ని ధేహి తమ్ ॥
అవతత్య ధనుష్ట్వగ్ం సహస్రాక్ష శతేషుధే । 12
నిశీర్య శల్యానామ్ముఖా శివో నః సుమానా భవ॥
నమస్త ఆయుధాయానాతతాయ ధృష్ణవే । 13
ఉభాభ్యాముత తే నమో బాహుభ్యాం తవ ధన్వనే ॥
మా నో మహాన్తముత మా నో అర్భకం 14
మా న ఉక్షన్తముత మా న ఉక్షితమ్
మానో వధీః పితరం మోత మాతరం
మా నః ప్రియాస్తన్వో రుద్ర రీరిషః॥
15
మా నస్తోకే తనయే మా న ఆయుషి
మా నో గోషు మా నో అశ్వేషు రీరిషః ।
మా నో వీరాన్ రుద్ర భామినో వధీర్హవిష్మన్తః
సదమిత్ త్వా హవామహే॥ 16
నమో హిరణ్యబాహవే సేనాన్యే దిశాం
చ పతయే నమో నమో వృక్షేభ్యో
హరికేశేభ్యః పశూనాం పతయే నమో నమః ।
శష్పిఞ్జరాయత్విషీమతే పథీనాం పతయే నమో
నమో హరికేశాయోపవీతినే పుష్టానాం పతయే నమః ॥ 17
నమో బభ్లుశాయ వ్యాధినేఽ_న్నానాం పతయే
నమో నమో భవస్య హేత్యై జగతాం పతయే
నమో నమో రుద్రాయాతతాయినే క్షేత్రాణాం పతయే
నమో నమః సూతాయాహన్త్యై వనానాం పతయే నమః ॥ 18
నమో రోహితాయ స్థపతయే వృక్షాణాం పతయే
నమో నమో భువన్తయే వారివస్కృ తాయౌషధీనాం
పతయే నమో నమో । మన్త్రిణే వాణిజాయ కక్షాణాం
పతయే నమో నమ ఉచ్చైర్ఘోషాయాక్రన్దయతే పత్తీనాం 19
పతయే నమః ॥

నమః కృత్స్నాయతయా ధావతే సత్వనాం పతయే నమో
నమః సహమానాయ నివ్యాధిన అవ్యాధినీనాం పతయే
నమో నమో, నిషఙ్గిణే కకుభాయ స్తేనానాం పతయే
నమో నమో నిచేరవే పరిచరాయారణ్యానాం పతయే నమః ॥ 20

నమో వఞ్చతే పరివఞ్చతే స్తాయూనాం పతయే
నమో నమో నిషఙ్గిణ ఇషుధిమతే
తస్కరాణాం పతయే నమో నమః ।
సృకాయిభ్యో జిఘాంసద్భ్యో ముష్ణతాం
పతయే నమో నమోఽసిమద్భ్యోనక్తఞ్చరద్భ్యో
వికృన్తానాం పతయే నమః ॥ 21

నమ ఉష్ణీషిణే గిరిచరాయ కులుఞ్చానాం పతయే నమో నమః ।
ఇషుమద్భ్యో ధన్వాయిభ్యశ్చ వో నమో నమ,
ఆతన్వానేభ్యః ప్రతి దధానేభ్యశ్చ వో నమో
నమ ఆయచ్ఛద్భ్యోఽస్యద్భ్యశ్చ వో నమః॥ 22

నమో విసృజద్భ్యో విధ్యద్భ్యశ్చ వో
నమో నమః స్వపద్భ్యో జాగ్రద్భ్యశ్చ వో
నమో నమః, శయానేభ్య ఆసీనేభ్యశ్చ వో
నమో నమస్తిష్ఠద్భ్యో ధావద్భ్యశ్చ వో నమః॥ 23

నమఃసభాభ్యః సభాపతిభ్యశ్చ వో
నమో నమోఽశ్వేభ్యోఽశ్వపతిభ్యశ్చ వో
నమో నమ, ఆవ్యాధినీభ్యో వివిధ్యన్తీభ్యశ్చ వో
నమో నమ ఉగణాభ్యస్తృంహతీభ్యశ్చ వో నమః ॥ 24

నమో గణేభ్యో గణపతిభ్యశ్చ వో
నమో నమో వ్రాతేభ్యో వ్రాతపతిభ్యశ్చ వో
నమో నమో, గృత్సేభ్యో గృత్సపతిభ్యశ్చ వో
నమో నమో విరూపేభ్యోఽవిశ్వరూపేభ్యశ్చ వో నమః॥ 25

నమః సేనాభ్యః సేనానిభ్యశ్చ వో నమో
నమో రథిభ్యో అరథేభ్యశ్చ వో నమో

నమః క్షత్తృభ్యః, సంగృహీతృభ్యశ్చ వో నమో
నమో మహద్భ్యో అర్భకేభ్యశ్చ వో నమః ॥ 26

నమ స్తక్షభ్యో రథకారేభ్యశ్చ వో నమో
నమః కులాలేభ్యః కర్మా రేభ్యశ్చ వో
నమో నమో, నిషాదేభ్యః పుఞ్జిష్ఠేభ్యశ్చ వో
నమో నమః శ్వనిభ్యోమృగయుభ్యశ్చ వో నమః॥ 27

నమః శ్వభ్యః శ్వపతిభ్యశ్చ వో నమో
నమో భవాయ చ రుద్రాయ చ, నమః
శర్వాయ చ పశుపతయే చ నమో
నీలగ్రీవాయ చ శితికణ్ఠాయ చ ॥ 28

నమః కపర్దినే చ వ్యుప్తకేశాయ చ నమః
సహస్రాక్షాయ చ శత ధన్వనే చ,
నమో గిరిశయాయ చ శిపివిష్టాయ చ
నమో మీఢుష్టమాయ చేషుమతే చ ॥ 29

నమో హ్రస్వాయ చ వామనాయ చ నమో
బృహతే చ వర్షీయసే చ నమో,
వృద్ధాయ చ సవృధే చ నమోఽగ్ర్యాయ చ ప్రథమాయ చ ॥ 30

నమ అశవే చాజిరాయ చ నమః
శీఘ్ర్యాయ చ శీభ్యాయ చ ।
నమ ఊర్మ్యాయ చావస్వన్యాయ చ
నమో నాదేయాయ చ ద్వీప్యాయ చ ॥ 31

నమో జ్యేష్ఠాయ చ కనిష్ఠాయ చ నమః
పూర్వజాయ చాపరజాయ చ నమో
మధ్యమాయ చాపగల్భాయ చ నమో
జఘన్యాయ చ బుధ్న్యాయ చ ॥ 32

నమః సోమ్యాయ చ ప్రతిసర్యాయ చ
నమో యామ్యాయ క్షేమ్యాయ చ ।
నమః శ్లోక్యాయ చావసాన్యాయ చ
నమ ఉర్వర్యాయ చ ఖల్యాయ చ ॥ 33

నమో వన్యాయ చ కక్ష్యాయ చ నమః
శ్రవాయ చ ప్రతిశ్రవాయ చ ।
నమ ఆశుషేణాయ చాశురథాయ చ నమః
శూరాయ చావభేదినే చ॥ 34

నమో బిల్మినే చ కవచినే చ నమో వర్మిణే చ వరూథినే చ ।
నమః శ్రుతాయ చ శ్రుతసేనాయ చ
నమో దున్దుభ్యాయ చాహనన్యాయ చ ॥ 35

నమో ధృష్ణవే చ ప్రమృశాయ చ
నమో నిషఙ్గిణే చేషుధిమతే చ ।
నమస్తీక్ష్ణేషవే చాయుధినే చ
నమః స్వాయుధాయ చ సుధన్వనే చ॥ 36

నమః స్రుత్యాయ చ పథ్యాయ చ
నమః కాట్యాయ చ నీప్యాయ చ ।
నమః కుల్యాయ చ సరస్యాయ చ
నమో నాదేయాయ చ వైశన్తాయ చ॥ 37

నమః కూప్యాయ చావట్యాయ చ నమో
వీధ్ర్యాయ చాతప్యాయ చ ।
నమో మేఘ్యాయ చ విద్యుత్యాయ చ నమో
వర్ష్యాయ చావర్ష్యాయ చ॥ 38

నమో వాత్యాయ చ రేష్మ్యాయ చ
నమో వా స్తవ్యాయ చ వాస్తుపాయ చ ।
నమః సోమాయ చ రుద్రాయ చ
నమస్తామ్రాయ చారుణాయ చ ॥ 39

నమః శఙ్గవే చ పశుపతయే చ నమ ఉగ్రాయ చ భీమాయ చ
నమోఽగ్రేవధాయ చ దూరేవధాయ చ । నమో హన్త్రే చ
హనీయసే చ నమో వృక్షేభ్యో హరికేశేభ్యో నమస్తారాయ ॥ 40

నమః శమ్భవాయ చ మయోభవాయ చ
నమః శఙ్కరాయ చ, మయస్కరాయ 41
చ నమః శివాయ చ శివతరాయ చ ॥

నమః పార్యా య చావార్యాయ చ నమః
ప్రతరణాయ చోత్తరణాయ చ ।
నమస్తీర్థ్యాయ చ కూల్యాయ చ నమః
శష్ప్యాయ చ ఫేన్యాయ చ ॥ 42

నమః సికత్యాయ చ ప్రవాహ్యాయ చ నమః
కి౯్శిలాయ చ క్షయణాయ చ ।
నమః కపర్దినే చ పులస్తయే చ
నమ ఇరిణ్యాయ చ ప్రపథ్యాయ చ ॥ 43

నమో వ్రజ్యాయ చ గోష్ఠ్యాయ చ
నమస్తల్ప్యాయ చ గేహ్యాయ చ ।
నమో హృదయ్యాయ చ నివేష్ప్యాయ చ
నమః కాట్యాయ చ గహ్వరేష్ఠాయ చ ॥ 44

నమః శుష్క్యాయ చ హరిత్యాయ చ
నమః పాగ్ం సవ్యాయ చ రజస్యాయ చ ।
నమో లోప్యాయ చోలప్యాయ చ
నమ ఊర్వ్యాయ చ సూర్వ్యాయ చ ॥ 45

నమః పర్ణాయ చ పర్ణశదాయ చ
నమ ఉద్గురమాణాయ చాభిఘ్నతే చ
నమ ఆఖిదతే చ ప్రఖిదతే చ నమ
ఇషుకృద్భ్యో ధనుష్కృద్భ్యశ్చ వో నమో నమో,
వః కిరికేభ్యో దేవానాగ్ం హృదయేభ్యో నమో,
విచిన్వత్కేభ్యో నమో విక్షిణత్కేభ్యో నమ ఆనిర్హతేభ్యః ॥ 46

ద్రాపే అన్ధసస్పతే దరిద్ర నీలలోహిత,
ఆసాం ప్రజానామేషాం పశూనాం ।
మా భేర్మా రోఙ్ మో చ నః కిం చనామమత్ ॥ 47

ఇమా రుద్రాయ తవసే కపర్దినే
క్షయద్వీరాయ ప్ర భరామహే మతీః ।
యథా శమసద్ద్విపదే చతుష్పదే విశ్వం
పుష్టం గ్రామే అస్మిన్ననాతురమ్ ॥ 48

యాతే రుద్ర శివా తనూః శివా విశ్వాహా భేషజీ ।
శివా రుతస్య భేషజీ తయా నో మృడ జీవసే ॥ 49

పరి నో రుద్రస్య హేతిర్వృణక్తు పరిత్వేషస్య దుర్మతిరఘాయోః ।
అవ స్థిరా మఘవద్భ్యస్తనుష్వ మీఢ్వస్తోకాయ తనయాయ మృడ॥50

మీఢుష్టమ శివతమ శివో నః సుమనా భవ,
పరమే వృక్ష ఆయుధం నిధాయ
కృత్తిం వసాన ఆ చర పినాకమ్బిభ్రదా గహి ॥ 51

వికిరిద్ర విలోహిత నమస్తే అస్తు భగవః ।
యాస్తే సహస్రశ్హేతయోఽన్యమస్మన్ని వపన్తు తాః॥ 52

సహస్రాణి సహస్రశో బాహ్వోస్తవ హేతయః ।
తాసామీశానో భగవః పరాచీనా ముఖా కృధి॥ 53

అసంఖ్యాతా సహస్రాణి యే రుద్రా అధి భూమ్యామ్ ।
తేషాఙ్ సహస్రయోజనేఽవ ధన్వాని తన్మసి ॥ 54

అస్మిన్ మహత్యర్ణవేఽన్తరిక్షే భవా అధి ।
తేషాఙ్ సహస్రయోజనేఽవ ధన్వాని తన్మసి ॥ 55

నీలగ్రీవాః శితికణ్ఠా దివఙ్ రుద్రా ఉపశ్రితాః ।
తేషాఙ్ సహస్రయోజనేఽవ ధన్వాని తన్మసి ॥ 56

నీలగ్రీవాః శితికణ్ఠాః శర్వా అధః క్షమాచరాః ।
తేషాఙ్ సహస్రయోజనేఽవ ధన్వాని తన్మసి ॥ 57

యే వృక్షేషు శష్పిఞ్జరా నీలగ్రీవా విలోహితాః ।
తేషాఙ్ సహస్రయోజనేఽవ ధన్వాని తన్మసి॥ 58

యే భూతానామధిపతయో విశిఖాసః కపర్దినః ।
తేషాఙ్ సహస్రయోజనేఽవ ధన్వాని తన్మసి ॥ 59

యే పథాం పథిరక్షయ ఐలవృదా ఆయుర్యుధః ।
తేషాఙ్ సహస్ర యోజనేఽవ ధన్వాని తన్మసి ॥ 60

యే తీర్థాని ప్రచరన్తి సృకాహస్తా నిషఙ్గిణః ।
తేషాఀ సహస్రయోజనేఽవ ధన్వాని తన్మసి ॥ 61

యేఽన్నేషు వివిధ్యన్తి పాత్రేషు పిబతో జనాన్ ।
తేషాఀ సహస్రయోజనేఽవ ధన్వాని తన్మసి ॥ 62

య ఏతావన్తశ్చ భూయాఀ సశ్చదిశో రుద్రా వితస్థిరే ।
తేషాఀ సహస్రయోజనేఽవ ధన్వాని తన్మసి॥ 63

నమోఽస్తు రుద్రేభ్యో యే దివి యేషాం వర్షమిషవః ।
తేభ్యో దశ ప్రాచీర్దశ దక్షిణా దశ ప్రతీచీర్దశోదీచీర్దశోర్ధ్వాః ।
తేభ్యో నమో అస్తు తే నోఽవన్తు తే నో మృడయన్తు తే యం
ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తమేషాం జమ్భే దధ్మః ॥ 64

నమోఽస్తు రుద్రేభ్యో యేఽన్తరిక్షే యేషాం వాత ఇషవః ।
తేభ్యో దశ ప్రాచీర్దశ దక్షిణా దశ ప్రతీచీర్దశోదీచీర్దశోర్ధ్వాః ।
తేభ్యో నమో అస్తు తే నోఽవన్తు తే నో మృడయన్తు తే యం ద్విష్మో
యశ్చ నో ద్వేష్టి తమేషాం జమ్భే దధ్మః ॥ 65

నమోఽస్తు రుద్రేభ్యో యే పృథివ్యాం యేషామన్నమిషవః ।
తేభ్యో దశ ప్రాచీర్దశ దక్షిణా దశ ప్రతీచీర్దశోదీచీర్దశోర్ధ్వాః ।
తేభ్యో నమో అస్తు తే నోఽవన్తు తే నో మృడయన్తు తే యం
ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తమేషాం జమ్భే దధ్మః ॥ 66

**ఇతి షోడఽశోధ్యాయః**

'రుదిర్-అశ్రువిమోచనే' అను ధాతువుతో రుద్ర శబ్ద మేర్పడుచున్నది. '**యో రోదయతి అన్యాయకారిణోః జనాన్ స రుద్రః**' దుష్టకర్మలను చేయువారిని ఏడ్పించువాడు కావున పరమేశ్వరునకు **'రుద్రుడు'** అని పేరు.

రుద్ర దేవతలు-11. అని పంచ ప్రాణములు, పంచ ఉప ప్రాణములు. ఈ దశ ప్రాణములు జడదేవతలు. పదకొండవదైన జీవాత్మ చేతన దేవత. ఇవన్నియు శరీరమును వదలి పోవునపుడు ఏడ్పించును. కావున ఇవి రుద్ర దేవత లనబడును.

ఈ అధ్యాయపు మంత్రములలోని నమః శబ్దమునకు 1. వంగుట 2. అన్నము. 3. వజ్రము అను అర్థములు కలవు.

ఉదా:

1. నమో జ్యేష్ఠాయచ కనిష్ఠాయచ (16-32)
పెద్దలకు, పిన్నలకు నమస్కారము.

2. 'నమః శ్వభ్యః శ్వపతిభ్యశ్చ' (16-28)
కుక్కలకు ఆహారము (అన్నము)

3. 'తస్కరాణాం పతయే నమః' (16-21)
దొంగలనాయకులకు వజ్రాయుధముచే వధించవలయును.

# చమకమ్

## యజుర్వేదము 18వ అధ్యాయము

వాజశ్చ మే ప్రసవశ్చ మే ప్రయతిశ్చ మే
ప్రసితిశ్చ మే ధీతిశ్చమే క్రతుశ్చ మే స్వరశ్చ మే ।
శ్లోకశ్చ మే శ్రవశ్చ మే శ్రుతిశ్చ మే జ్యోతిశ్చ
మే స్వశ్చమే యజ్ఞేన కల్పన్తామ్ ॥ 1

(స్వాహా ఇదం యజ్ఞాయ ఇదం న మమ)

ప్రాణశ్చ మేఽపానశ్చ మే వ్యానశ్చ
మేఽసుశ్చ మే చిత్తంచ మ ఆధీతం చ మే।
వాక్ చ మే మనశ్చ మే చక్షుశ్చ మే
శ్రోత్రం చ మే దక్షశ్చ మే బలం చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ 2

ఓజశ్చ మే సహశ్చ మ ఆత్మా చ
మే తనూశ్చ మే శర్మ చ మే వర్మ చ
మేఽఙ్గాని చ మేఽస్థీని చ మే పరూꣳషి చ
మే శరీరాణి చ మ ఆయుశ్చ
మే జరా చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ 3

జ్యైష్ఠ్యం చ మ ఆధిపత్యం చ మే మన్యుశ్చ మే భామశ్చ మేఽమశ్చ
మేఽమ్భశ్చ మే జేమా చ మే మహిమా చ మే, వరిమా చ మే
ప్రథిమా చ మే వర్ష్మా చ మే ద్రాఘిమా చ మే వృద్ధం చ మే
వృద్ధిశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ 4

సత్యం చ మే శ్రద్ధా చ మే జగచ్చమే ధనం
చ మే విశ్వం చ మే మహశ్చ మే
క్రీడా చ మే మోదశ్చ మే, జాతం చ మే
జనిష్యమాణం చ మే సూక్తం చ మే
సుకృతం చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ 5

ఋతం చ మేఽమృతం చ మేఽయక్ష్మం
చ మేఽనామయచ్చ మే జీవాతుశ్చ మే
దీర్ఘాయుత్వం చ మే నఽమిత్రం చ మేఽభయం
చ మే సుఖం చ మే శయనం చ మే సూషాశ్చ మే
సుదినం చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ 6

యన్తా చ మే ధర్తా చ మే క్షేమశ్చ మే ధృతిశ్చ
మే విశ్వం చ మే మహశ్చ మే
సంవిచ్చ మే, జ్ఞాత్రం చ మే సూశ్చ
మే ప్రసూశ్చ మే సీరం చ మే లయశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ 7

శం చ మే మయశ్చ మే ప్రియం చ మేఽనుకామశ్చ మే
కామశ్చ మే సౌమనసశ్చ మే, భగశ్చ మే ద్రవిణం చ మే
భద్రం చ మే శ్రేయశ్చ మే వసీయశ్చ మే యశశ్చ మే
యజ్ఞేన కల్పన్తామ్ ॥ 8

ఊర్క్ చ మే సూనృతాం చ మే పయశ్చ మే రసశ్చ మే ఘృతం
చ మే మధు చ మే సగ్ధిశ్చ మే, సపీతిశ్చ మే కృషిశ్చ మే వృష్టిశ్చ
మే జైత్రం చ మ ఔద్భిద్యం చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ 9

రయిశ్చ మే రాయశ్చ మే పుష్టం చ మే
పుష్టిశ్చ మే విభు చ మే ప్రభు చ మే
పూర్ణం చ మే, పూర్ణతరం చ మే
కుయవం చ మేఽక్షితం చ మేఽన్నం చ
మేఽక్షుచ్చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ 10

విత్తం చ మే వేద్యం చ మే భూతం చ
మే భవిష్యచ్చ మే సుగం చ మే
సుపథ్యం చ మఽబుద్ధం చ
మఽబుద్ధిశ్చమే, క్లృప్తం చ మే క్లృప్తిశ్చమే
మతిశ్చమే సుమతిశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ 11

వ్రీహయశ్చ మే యవాశ్చ మే మాషాశ్చ మే తిలాశ్చ
మే ముద్గాశ్చ మే ఖల్వాశ్చ మే ప్రియఙ్గవశ్చ మేఽణవశ్చమే,
శ్యామాకాశ్చ మే నీవారాశ్చ మే గోధూమాశ్చ
మే మసూరాశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ 12

అశ్మా చ మే మృత్తికా చ మే గిరయశ్చ మే పర్వతాశ్చ
మే సికతాశ్చ మే వనస్పతయశ్చ మే హిరణ్యం చ మేఽయశ్చ
మే శ్యామం చ మే లోహంచ మే సీసం చ మే త్రపు చ మే
యజ్ఞేన కల్పన్తామ్ ॥ 13

అగ్నిశ్చ మ ఆపశ్చ మే వీరుధశ్చ మఽఓషధయశ్చ మే
కృష్టపచ్యాశ్చ మేఽకృష్టపచ్యాశ్చ మే, గ్రామ్యాశ్చ మే
పశవ ఆరణ్యాశ్చ మే విత్తఞ్చ మే విత్తిశ్చ మే భూతఞ్చ మే
భూతిశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ 14

వసు చ మే వసతిశ్చ మే కర్మ చ మే శక్తిశ్చ మేఽర్థశ్చ
మ ఏమశ్చ మఽఇత్యా చ మే । గతిశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 15

అగ్నిశ్చ మఽఇన్ద్రశ్చ మే సోమశ్చ మఽఇన్ద్రశ్చ మే సవితా
చ మ ఇన్ద్రశ్చ మే సరస్వతీ చ మఽఇన్ద్రశ్చమే, పూషా

చ మ ఇన్ద్రశ్చ మే బృహస్పతిశ్చ మ ఇన్ద్రశ్చ మే
యజ్ఞేన కల్పన్తామ్ ॥ 16

మిత్రశ్చ మ ఇన్ద్రశ్చ మే వరుణశ్చ మ ఇన్ద్రశ్చ మే
ధాతా చ మ ఇన్ద్రశ్చ మే త్వష్టా చ మ ఇన్ద్రశ్చ మే,
మరుతశ్చ మ ఇన్ద్రశ్చ మే విశ్వే చ మే దేవా
ఇన్ద్రశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్॥ 17

పృథివీ చ మ ఇన్ద్రశ్చ మేఽన్తరిక్షం చ
మ ఇన్ద్రశ్చమే ద్యౌశ్చ మ ఇన్ద్రశ్చ మే
సమాశ్చ మఽ ఇన్ద్రశ్చ మే, నక్షత్రాణి చ
మ ఇన్ద్రశ్చ మే దిశశ్చ మ ఇన్ద్రశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ 18

అꣳశుశ్చ మే రశ్మిశ్చ మేఽదాభ్యశ్చ మేఽధిపతిశ్చ
మ ఉపాꣳశుశ్చ మేఽన్తర్యామశ్చ మ ఐన్ద్రవాయవశ్చ మే,
మైత్రావరుణశ్చ మ ఆశ్వినశ్చ మే ప్రతిప్రస్థానశ్చ మే,
శుక్రశ్చ మే మన్థీ చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ 19

ఆగ్రయణశ్చ మే వైశ్వదేవశ్చ మే ధ్రువశ్చ
మే వైశ్వానరశ్చ మ ఐన్ద్రాగ్నశ్చమే,
మహావైశ్వదేవశ్చ మే మరుత్వతీయాశ్చ
మే నిష్కేవల్యశ్చ మే సావిత్రశ్చ మే
సారస్వతశ్చమే, పాత్నీవతశ్చమే
హారియోజనశ్చమే యజ్ఞేన కల్పన్తామ్ ॥ 20

స్రుచశ్చ మే చమసాశ్చ మే వాయవ్యాని చ
మే ద్రోణకలశశ్చ మే గ్రావాణశ్చ
మేఽధిషవణే చ మే, పూతభృచ్చ మ ఆధవనీయశ్చ మే
వేదిశ్చ మే బర్హిశ్చ మేఽవభృథశ్చ మే స్వగాకారశ్చ మే
యజ్ఞేన కల్పన్తామ్ ॥ 21

అగ్నిశ్చ మే ఘర్మశ్చ మేఽర్కశ్చ మే
సూర్యశ్చ మే ప్రాణశ్చ మేఽశ్వమేధశ్చ

మే పృథివీ చ మేఽ దితిశ్చ మేఽ దితిశ్చ మే,
ద్యౌశ్చ మేఽ ఙ్గులయః శక్వరయో
దిశశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ 22

వ్రతం చ మ ఋతవశ్చ మే తపశ్చ మే సంవత్సరశ్చ
మేఽ హోరాత్రే ఊర్వష్ఠీవే బృహద్రథన్తరే చ మే
యజ్ఞేన కల్పన్తామ్ ॥ 23

ఏకాచమే తిస్రశ్చమే తిస్రశ్చమే పఞ్చచమే పఞ్చచమే సప్తచమే
సప్తచమే నవచమే నవచమఽ ఏకాదశచమఽ ఏకాదశచమే,
త్రయో దశచమే త్రయోదశచమే పఞ్చదశచమే పఞ్చదశచమే
సప్తదశచమే సప్తదశచమే నవదశచమే, నవదశచమఽ
ఏకవి ంశతిశ్చమ ఏకవి ంశ తిశ్చమే త్రయోవి ంశతిశ్చమే
త్రయోవి ంశ తిశ్చమే పఞ్చవి ంశ తిశ్చమే పఞ్చవి ంశతిశ్చమే
సప్తవి ంశ తిశ్చమే సప్తవి ంశ తిశ్చమే నవవి ంశతిశ్చమే
నవవి ంశ తిశ్చమఽ ఏకత్రి ంశచ్చమఽ ఏకత్రి ంశచ్చమే
త్రయత్రి ంశచ్చమే యజ్ఞేన కల్పన్తామ్॥24॥

చతస్రశ్చ మేఽ ష్టౌ చ మేఽ ష్టౌ చ మే ద్వాదశ చ మే
ద్వాదశ చ మే షోడశ చ మే షోడశ చ మే వి ంశతిశ్చమే,
వి ంశతిశ్చమే చతుర్వి ంశతిశ్చమే చతుర్వి ంశతిశ్చమేఽ ష్టావి
శతిశ్చమే ఽ ష్టావి ంశతిశ్చమే ద్వాత్రి ంశచ్చమే, ద్వాత్రి ంశచ్చమే
షట్త్రి ంశచ్చమే షట్త్రి ంశచ్చమే చత్వారి ంశచ్చమే చత్వారి ంశచ్చమే
చతుశ్చత్వారి ంశచ్చమే చతుశ్చత్వారి ంశచ్చమేఽ ష్టా చత్వారి ంశచ్చమే
యజ్ఞేన కల్పన్తామ్ ॥ 25

త్ర్యవిశ్చ మే త్ర్యవీ చ మే దిత్యవాట్ చ మే దిత్యౌహీ చ మే
పఞ్చావిశ్చ మే పఞ్చావీ చ మే, త్రివత్సశ్చ మే త్రివత్సా చ మే
తుర్యవాట్ చ మే తుర్యౌహీ చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥ 26

షష్ఠవాట్ చ మే షష్ఠౌహీ చ మఽ ఉక్షా చ మే
వశా చ మఽ ఋషభశ్చ మే వేహచ్చ మేఽ నడ్వాం
శ్చమే ధేనుశ్చమే యజ్ఞేన కల్పన్తామ్ ॥ 27

వాజాయ స్వాహా ప్రసవాయ స్వాహా పిజాయ స్వాహా
క్రతవే స్వాహా వసవే స్వాహాఽహర్పతయే స్వాహాఽహ్నే
ముగ్ధాయ స్వాహా ముగ్ధాయ వైన౦శినాయ స్వాహా
వినఀశిన ఆన్త్యాయనాయ స్వాహాఽఽన్త్యాయ భౌవనాయ స్వాహా
భువనస్య పతయే స్వాహాఽధిపతయే స్వాహా ప్రజాపతయే స్వాహా,
ఇయం తే రాణ్మిత్రాయ యన్తాఽసి యమన ఊర్జే త్వా వృష్ట్యై
త్వా ప్రజానాం త్వాఽఽధిపత్యాయ ॥ 28

ఆయుర్యజ్ఞేన కల్పతాం ప్రాణో యజ్ఞేన కల్పతాం
చక్షుర్యజ్ఞేన కల్పతా౦, శ్రోత్రం యజ్ఞేన కల్పతాం
వాగ్యజ్ఞేన కల్పతాం, మనో యజ్ఞేన కల్పతామాత్మా
యజ్ఞేన కల్పతాం బ్రహ్మా యజ్ఞేన కల్పతాం జ్యోతిర్యజ్ఞేన
కల్పతా౦, స్వర్యజ్ఞేన కల్పతాం పృష్ఠం యజ్ఞేన కల్పతాం
యజ్ఞో యజ్ఞేన కల్పతామ్ । స్తోమశ్చ యజుశ్చఽ ఋక్ చ
సామచ బృహచ్చ రథన్తరం చ । స్వర్దేవాఽ అగన్మామృతాఽ
అభూమ ప్రజాపతేః ప్రజాఽ అభూమ వేట్ స్వాహా॥ 29

వాజస్య ను ప్రసవే మాతరం మహీమదితి
న్నామ వచసా కరామహే । యస్యామిదం విశ్వం
భువనమావివేశ తస్యాన్నో దేవః సవితా ధర్మ సావిషత్॥ 30

విశ్వేఽ అద్య మరుతో విశ్వఽ ఊతీ
విశ్వే భవన్త్వగ్నయః సమిద్ధాః ।
విశ్వేఽ నోదేవాఽ అవసాఽఽగమన్తు
విశ్వమస్తు ద్రవిణం వాజోఽ అస్మే ॥ 31

వాజో నః సప్త ప్రదిశశ్చతస్రో వా పరావతః ।
వాజో నో విశ్వైర్దేవైర్ధన సాతా విహావతు ॥ 32

వాజో నోఽ అద్య ప్ర సువాతి దానం వాజో
దేవాఀ ఽ 2 ఋతుభిః కల్పయాతి । వాజో హి
మా సర్వవీరం జజాన విశ్వా ఆశా వాజపతిర్జయేయమ్ ॥ 33

వాజః పురస్తాదుత మధ్యతో నో
వాజో దేవాన్ హవిషా వర్ధయాతి ।
వాజో హి మా సర్వవీరం చకార
సర్వా ఆశా వాజపతిర్భవేయమ్ ॥ 34

సం మా సృజామి పయసా పృథివ్యాః
సం మా సృజామ్యద్భిరోషధీభిః ।
సోఽహం వాజగ్ం సనేయ మగ్నే ॥ 35

పయః పృథివ్యాగ్ం పయ ఓషధీషు పయో
దివ్యన్తరిక్షే పయో ధాః । పయస్వతీః ప్రదిశః
సన్తు మహ్యమ్ ॥ 36

దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం
పూష్ణో హస్తాభ్యామ్ । సరస్వత్యై వాచో యన్తుర్యన్త్రేణాగ్నేః
సామ్రాజ్యేనాభి షిఞ్చామి । 37

ఋతాషాడృత ధామాఽగ్నిర్గన్ధర్వస్త
స్యౌషధయోఽప్సరసో ముదో నామ ।
స న ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై
స్వాహా వాట్ తాభ్యః స్వాహా ॥ 38

సగ్ంహితో విశ్వసామా సూర్యో గన్ధర్వ స్తస్య
మరీచయోఽప్సరస ఆయువో నామ ।
స న ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై
స్వాహా వాట్ తాభ్యః స్వాహా ॥ 39

సుషుమ్ణః సూర్యరశ్మిశ్చన్ద్రమా గన్ధర్వ స్తస్య
నక్షత్రాణ్యప్సరసో భేకురయో నామ । స న
ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా
వాట్ తాభ్యః స్వాహా॥

40

ఇషిరో విశ్వవ్యచా వాతో గన్ధర్వస్తస్యాపో
అప్సరస ఊర్జో నామ । స న ఇదం బ్రహ్మ
క్షత్రం పాతు తస్మై స్వాహా వాట్ తాభ్యః స్వాహా ॥ 41

భుజ్యుః సుపర్ణో యజ్ఞో గన్ధర్వస్తస్య
దక్షిణా అప్సరస స్తావా నామ । స న
ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా
వాట్ తాభ్యః స్వాహా ॥ 42

ప్రజాపతిర్విశ్వకర్మా మనో గన్ధర్వస్తస్య
ఋక్సామాన్యప్సరస ఏష్టయో నామ ।
స న ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా
వాట్ తాభ్యః స్వాహా ॥ 43

సనో భువనస్యపతే ప్రజాపతే యస్య
త ఉపరి గృహా యస్యవేహ ।
అస్మై బ్రహ్మణేఽస్మై క్షత్రాయ
మహి శర్మ యచ్ఛ స్వాహా ॥ 44

సముద్రోఽసి నభస్వానార్ద్రదానుః
శమ్భూర్మయో భూరభి మా వాహి స్వాహా।
మారుతోఽసి మరుతాం గణః శమ్భూర్మ
యోభూరభి మా వాహి స్వాహాఽవస్యూరసి
దువస్వాఞ్ఛమ్భూర్మయోభూరభి మా వాహి స్వాహా ॥ 45

యాస్తే అగ్నే సూర్యే రుచో దివమాతన్వన్తి రశ్మిభిః ।
తాభిర్నో అద్య సర్వాభీ రుచే జనాయ నస్కృధి ॥ 46

యా వో దేవాః సూర్యే రుచో గోష్వశ్వేషు యా రుచః ।
ఇన్ద్రాగ్నీ తాభిః సర్వాభీ రుచం నో ధత్త బృహస్పతే ॥ 47

రుచం నో ధేహి బ్రహ్మణేషు రుచꣳ రాజసు నస్కృధి ।
రుచం విశ్యేషు శూద్రేషు మయి ధేహి రుచా రుచమ్ ॥ 48

తత్వా యామి బ్రహ్మణా వన్దమానస్తదాశాస్తే
యజమానో హవిర్భిః । అహేడమానో వరుణేహ
బోధ్యురుశ ళ్య స మా న ఆయుః ప్ర మోషీః ॥ 49

స్వర్ణ ఘర్మః స్వాహా స్వర్ణార్కః స్వాహా స్వర్ణ శుక్రః స్వాహా
స్వర్ణజ్యోతిః స్వాహా స్వర్ణ సూర్యః స్వాహా ॥ 50

అగ్నిం యునజ్మి శవసా ఘృతేన దివ్యళ్య సుపర్ణం
వయసా బృహన్తమ్ । తేన వయం గమేమ బ్రధ్నస్య
విష్టపళ్య స్వో రుహాణా అధి నాకముత్తమమ్ ॥ 51

ఇమౌ తే పక్షావజరౌ పతత్రిణౌ యాభ్యాళ్య రక్షాళ్య స్యపహళ్యస్యగ్నే ।
తాభ్యాం పతేమ సుకృతాము లోకం యత్ర ఋషయో
జగ్ముః ప్రథమజాః పురాణాః ॥ 52

ఇన్దుర్దక్షః శ్యేన ఋతావార్హిరణ్యపక్షః శకునో భురణ్యుః ।
మహాన్త్సధస్థే ధ్రువ ఆ నిషత్తో నమస్తే అస్తు మా మా హిళ్యసీః ॥53

దివో మూర్ధాఽసి పృథివ్యా నాభిరూర్గపామోషధీనామ్ ।
విశ్వాయుః శర్మ సప్రథా నమస్పథే ॥ 54

విశ్వస్య మూర్ధన్నధి తిష్ఠసి శ్రితః సముద్రే తే
హృదయమప్స్వాయురపో దత్తో దధింభిన్త । దివస్పర్జన్యాద
న్తరిక్షాత్ పృథివ్యాస్తతో నో వృష్ట్యావ ॥ 55

ఇష్టో యజ్ఞో భృగుభిరాశీర్దా వసుభిః ।
తస్య న ఇష్టస్య ప్రీతస్య ద్రవిణేహా గమేః ॥ 56

ఇష్టో అగ్నిరాహుతః పిపర్తు న ఇష్టళ్య హవిః ।
స్వగేదం దేవేభ్యో నమః ॥ 57

యదాకూతాత్సమసుస్రోద్ధృదో వా మనసో వా
సంభృతం చక్షుషో వా । తదను ప్రేత సుకృతాము
లోకం యత్ర ఋషయో జగ్ముః ప్రథమజాః పురాణాః ॥ 58

ఏతగ్ం సధస్థ పరి తే దదామి యమావహాచ్ఛేవధిం జాతవేదాః ।
అన్వాగన్తా యజ్ఞపతిర్వో అత్ర తగ్ం స్మ జానీత పరమే వ్యోమన్॥59

ఏతం జానాథ పరమే వ్యోమన్ దేవాః సధస్థా విద రూపమస్య ।
యదాగచ్ఛాత్ పథిభిర్దేవయానై రిష్టా పూర్తే కృణవాథా వి రస్మై ॥60

ఉద్బుధ్యస్వాగ్నే ప్రతి జాగృహి త్వమిష్టాపూర్తే సగ్ం సృజేథామయం చ ।
అస్మిన్సధస్థే అధ్యుత్తరస్మిన్ విశ్వే దేవా యజమానశ్చ సీదత ॥ 61

యేన వహసి సహస్రం యేనాగ్నే సర్వవేదసమ్ ।
తేనేమం యజ్ఞం నో నయ స్వర్దేవేషు గన్తవే ॥ 62

ప్రస్తరేణ పరిధినా స్రుచా వేద్యా చ బర్హిషా ।
ఋచేమం యజ్ఞం నో నయ స్వర్దేవేషు గన్తవే ॥ 63

యద్దత్తం యత్పరాదానం యత్పూర్తం యాశ్చ దక్షిణాః ।
తదగ్నిర్వైశ్వకర్మణః స్వర్దేవేషు నో దధత్ ॥ 64

యత్ర ధారా అనపేతా మధోర్ఘృతస్య చ యాః ।
తదగ్నిర్వైశ్వ కర్మణః స్వర్దేవేషు నో దధత్ ॥ 65

అగ్నిరస్మి జన్మనా జాతవేదా ఘృతం
మే చక్షురమృతం మ ఆసన్ ।
అర్కస్త్రిధాతూ రజసో విమానోఽజ
స్రో ఘర్మో హవిరస్మి నామ ॥ 66

ఋచో నామాస్మి యజూగ్ంషి నామాస్మి సామాని నామాస్మి ।
యే అగ్నయః పాఞ్చజన్యా అస్యాం పృథివ్యామధి ।
తేషామసి త్వముత్తమః ప్ర నో జీవాతవే సువ ॥ 67

వార్త్రహత్యాయ శవసే పృతనాషాహ్యాయ చ ।
ఇన్ద్రఽత్వావర్తయామసి ॥ 68

సహదానుం పురుహూత క్షియన్త మహస్త మిన్ద్ర
సంపిణక్ కుణారుమ్ । అభివృత్రం వర్ధమానం
పియారుమపాదమిన్ద్ర తవసా జఘన్థ ॥ 69

విన ఇన్ద్ర మృధో జహి నీచా యచ్ఛ పృతన్యతః ।
యో౨_ అస్మాం౨ ౨_ అభిదా సత్యధరం గమయా తమః ॥ 70

మృగో న భీమః కుచరో గిరిష్ఠాః
పరావత ఆ జగన్థా పరస్యాః ।
సృకం సంశాయ పవిమిన్ద్ర తిగ్మం వి
శత్రూన్తాడి వి మృధో నుదస్వ ॥ 71

వైశ్వానరో న ఊతయ ఆ ప్ర యాతు పరావతః ।
అగ్నిర్నః సుష్టు తీరుప ॥ 72

పృష్టోదివి పృష్టో అగ్నిః పృథివ్యాం
పృష్టో విశ్వా ఓషధీరా వివేశ ।
వైశ్వానరః సహసా పృష్టో అగ్నిః
సనో దివా స రిషస్పాతు నక్తమ్ ॥ 73

అశ్యామ తం కామమగ్నే తవోతీ అశ్యామ రయిం
రయివ: సువీరమ్ । అశ్యామ వాజమభి వాజయన్తో౨_ శ్యామ
ద్యుమ్నమజరాజరం తే॥ 74

వయం తే అద్య రరిమా హి కామముత్తానహస్తా నమసోపసద్య ।
యజిష్ఠేన మనసా యక్షి దేవానస్రేధతా మన్మనా విప్రో అగ్నే॥ 75

ధామచ్ఛదగ్నిరిన్ద్రో బ్రహ్మా దేవో బృహస్పతిః ।
సచేతసో విశ్వే దేవా యజ్ఞం ప్రావన్తు నః శుభే ॥ 76

త్వం యవిష్ఠ దాశుషో నౄంఃపాహి శృణుధీ గిరః ।
రక్షా తోకముత త్మనా ॥ 77

ఇత్యాష్టాదశో౨_ ధ్యాయః

Gayatri Series: 67
GANAPATHI RAHASYAM
SHIVARATRI RAHASYAM

Price: Rs. 50/




ఓం నమో గణేభ్యో గణపతిభ్యశ్చ వో నమో
నమో వ్రాతేభ్యో వ్రాతపతిభ్యశ్చ వో నమో,
నమో గృత్సేభ్యో గృత్సపతిభ్యశ్చ వో నమో,
నమో విరూపేభ్యో విశ్వరూపభ్యశ్చ వో నమః ॥

- యజుర్వేదం 16-25

'గణ-సంఖ్యానే' కార్మిక కర్షక గణములకు మా నమస్సులు. వారి కవసరమైన అన్న వస్త్ర ఆవాసాదులను ఏర్పరతుముగాక! కార్మిక కర్షక గణాధ్యక్షులకు, నాయకులకు మా నమస్సులు. వారిని తగినవిధంగా గౌరవింతుముగాక!

ఓం శివాం రాత్రి మనుసూర్యం చ
హిమస్య మాతా సుహవా నో అస్తు।
అస్య స్తోమస్య సుభగే ని బోధ
యేన త్వా వన్దే విశ్వాసు దిక్షు ॥

- అథర్వవేదం 19-49-5

సూర్యాస్తసమయానంతరం వచ్చు ప్రతీ రాత్రీ సుఖశాంతుల నిచ్చునదియే. పరమాత్ముని ఉపాసనకు రాత్రియే అనుకూలంగా ఉంటుంది. ప్రాచీన ఋషులు, మునులు, యోగులు రాత్రులందే - బ్రాహ్మీముహూర్తంలోనే (తెల్లవారు ఝామునవే) ఉపాసనచేసి పరమశాంతిని పొందారు. శివుడే సర్వదిశలలో వ్యాపకుడై స్తవనీయుడుగా, వందనీయుడుగా ఉన్నాడు. అతడే మనకు అత్యంత సమీపంగా మన ఆత్మలోనే వ్యాపించి ఉన్నాడు. అతనిని ఉపాసించుటయే-ధ్యానించుటయే సర్వోత్తమము.

Published by:
**Gayatri Ashram Trust**
12-10-586/6, Vyas Vedic Kalyana Mandapam,
Medi Bavi, Seetaphalmandi (P.O.), Secunderabad-500061.
Cell: 92906 04641